ఒకగ్రామం గ్రామాన్ని మొత్తం నానా భీభత్సం చేసిన దానవ సమూహాన్ని
ఒంటరిగా నిలిచి ఎదిరించిన సాహస యువకుని విచిత్రగాథ!...చూడండి!

కృష్ణ సమర్పించు



శ్రీ వెంకటేశ్వర
ఆర్ట్ పిక్చర్స్

# మంచివాళ్ళకు మంచివాడు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం కె.యస్.ఆర్.దాస్
నిర్మాత యస్.భావనారాయణ

డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ
వి.యస్.ఆర్.స్వామి WICA
సంగీతం సత్యం

ఆంధ్ర పూర్ణా పిక్చర్స్ సీడెడ్ నవభారత్ ఫిలిమ్స్ నైజాం శ్రీ తారకరామ ఫిలిమ్స్ మైసూరు విజయ పిక్చర్స్ సర్క్యూట్

NVKR

S.V.S
FILMS

యస్.వి.యస్. ఫిలింస్ సమర్పించు

# డబ్బుకు లోకం దాసోహం

నిర్మాత: యమ్. జగన్నాథరావు దర్శకత్వం: డి. యోగానంద్

ఆంధ్ర: తారకరామ, సీడెడ్: నవభారత్, నైజాం: ఉషా

THARAKA RAMA

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)
శుక్రవారం : 12–1–73
శ్రీపరీధావినామ సం॥ పౌష్యమా॥ శు॥ నవమి
సంపుటము : 66 సంచిక : 17
స్థాపితం 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు

## అ పో హ

అయ్యా 24—11—72 ఆంధ్రసచిత్రవార పత్రిక సంచికలో వావిలాల—ఖరగపూరం అని ఒక ఉత్తరం ప్రకటితమైనది. పేరు అంతా అందులో లేనందువ నేను వ్రాశాననే అభిప్రాయంతో నన్ను అడుగుతున్నారు. అది నాది కాదని ప్రకటించినా సరే లేక వారి పూర్తి పేరు ప్రకటించినా సరే. నాదనుకొని అపోహ పడుతున్నారు. ఆ అపోహను తొలగించ ప్రార్థన.

వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి)

## ఉత్తరాలు





## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'జీవనతరంగాలు'లో శోభన్ బాబు.


ఆంధ్ర వేర్పాటు ఉద్యమానికి విజయం
ఏ ప్రతిబంధకాన్నైనా ఎదిరించే ప్రజాశక్తి
కాల్పులకు గురిఅయిన వారి ఉత్సాహం


నిప్పుతో చెలగాటం ఆడుతున్నారు
ఆంధ్రలో మరికొన్ని చోట్ల కాల్పులు
గరీబీ హటావో ఏమయినట్లు?
మన్నించండి మరి కొంత కాలం ఓపిక పట్టండి
కలకత్తా సమావేశం దోరణి


కొత్త సంవత్సరం తీర్మానం
ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోసం ఏ త్యాగానికైనా సిద్ధం
1973
జనవరి
1
ఆంధ్ర ప్రజలు

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర



## కాకాని

'రైతు శ్రేయస్సే నా లక్ష్యం. మూడేళ్లుగా నేను మంత్రిగా ఉన్నప్పుడు గాని, అంతకు ముందుగాని రైతులను ఉద్ధరించటానికే నా జీవితం అర్పించాను' అన్నారు కీ॥ శే॥ కాకాని వెంకటరత్నంగారు రెండు నెలలకింద ఆంధ్రపత్రిక విలేఖరితో మాట్లాడుతున్నప్పుడు. అర్ధ శతాబ్దపు రాజకీయ జీవితంలో వారు కృషి చేసినదంతా భారతదేశానికీ, అందులోనూ ఆంధ్ర దేశానికీ వెన్నెముక వంటివారయిన రైతులకోసమే. వారి కృషి సాధించిన అభివృద్ధికన్నా ఉత్తమమయిన స్మృతి చిహ్నం కాకాని వెంకటరత్నంగారికి ఉండలేదు. వారిని ప్రజలు ఉక్కు కాకాని అని పిలిచేవారు; వీర కాకాని అని పిలిచేవారు. జీవితంలో చివరి క్షణందాకా ఉక్కువంటి దృఢ సంకల్పంతో తమ ప్రజల శ్రేయస్సుకోసమే పాటుపడిన కాకాని వెంకటరత్నంగారు వీరమరణం పొందారు. అందరితోబాటు మేమూ వారి ఆత్మశాంతికోసం భగవంతుడిని ప్రార్థిస్తున్నాము.

—సం॥

### కుక్కలు! కుక్కలు!

ఊరకుక్కల గోలగురించి గాథాసప్తశతిలో ఎన్నో ప్రస్తావనలున్నాయి. 'ఏ వూరిది? పాడువూరు! కుక్కలగోల భరించలేమండీ?' అంటుంది ఒక రసికురాలు వ్యంగ్యంగా. వెయ్యేళ్లు రెండుసార్లు గడచినా ఈ కుక్కలగోల ఆంధ్రదేశంలో తగ్గినట్టు కనిపించదు. మన రాజధాని నగరమయిన భాగ్యనగరంలోనైతే ఈ శునక సౌభాగ్యం మరీ ఎక్కువ. పట్టణపెద్దలు నివసిస్తున్న ప్రాంతాలలోను చిన్న కునుకుకయినా అవకాశంలేకుండా ఈ ఊరకుక్కల గోల భరించరానిదవుతున్నదంటే, మునిసిపాలిటీ వారిని కోప్పడితే తప్పా! దోమల బాధకు తెరలో దూరవచ్చు. నడివీధులలో పారే మురుగు వరదలను నీరాంజనేయుని స్మరిస్తూ లంఘించవచ్చు. రాత్రిళ్లు మొరిగే కుక్కలనోళ్లు ఎలా కట్టగలం? ఎవరు కట్టగలరు, పురపాలకులు తప్ప! ఇరుగు పొరుగు రాష్ట్రంలోగా మన రాష్ట్రంలోను, కుక్కలనుపట్టి చంపివేసే పద్ధతి అనుసరిస్తే పాపమేమీ రాదు. పాపం, పుణ్యం, ధర్మం అనేవి కాలానుగుణంగా మారుతూంటాయి. అందువల్లే వ్యాసులవారన్నారు 'ఆచార ప్రభవో ధర్మః' అని.

### అభినవ గాంధారి!

ప్రేమకోసం కళ్లకు గంతలు కట్టుకొన్నవారు, ప్రేమకోసం కళ్లు పొడుచుకొన్నవారు. మన పురాణాలలో కోకొల్లలు. మనకే కాదు, ప్రతి దేశ పురాణాలలోను ఉన్నారు. అలాటి త్యాగాలకు నూతన నిదర్శనం డిసెంబర్ 2 వ వారంలో అంబర్‌పేట్‌లో వున్న అంతర్జాతీయ అంధసంఘం రాష్ట్రశాఖా భవనంలో జరిగిన వివాహం. ప్రభుత్వం అప్పర్ ప్రైమరీ స్కూలులో హిందీ పండితుడుగా వున్న ఎం. నారాయణ అనే పుట్టంధుణ్ని కుమారి అనూరాధ వివాహమాడింది. ఇది వర్ణాంతర వివాహమే

కాక దృష్ట్యాంతర వివాహాలను వలువురు ప్రశంసించారు, శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్, శ్రీ చింతామణి దేశ్‌ముఖ్, శ్రీమతి యళ్ళాప్రగడ సీతాకుమారి సంఘ సేవా శాఖా మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు మొదలయినవారు. ప్రముఖ సంఘ సేవకుడు శ్రీ ఎస్. కె. ఆచార్య వివాహ ప్రాముఖ్యం తెలిపి నూతన పద్ధతిలో వివాహం జరిపించారు. ఆంధ్రప్రదేశ్ కుల నిర్మూలన సంఘం వధూవరులకు నూతన వస్త్రాలు బహూకరించారు.

### వైకుంఠఏకాదశి ఉత్సవాలు

సికిందరాబాద్ శివాజీ నగర్‌లోని వెంకటేశ్వర పెరుమాళ్ కోవెలలో డిసెంబర్ 16 వ తేదీనుంచి వైకుంఠఏకాదశి ఉత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. ప్రముఖ కాయితాల వర్తకులు, సాహిత్యాభిమాని శ్రీ గోలి ఈశ్వరయ్యసేవతో ఈ ఉత్సవం ప్రారంభమయింది. వైకుంఠఏకాదశి, ధనుర్మాసం అనే విషయాలు భారతజాతి ప్రాచీనతకు అవశేషాలుగా నాకు భాసిస్తుంటాయి. ఎన్నాళ్ళనాడు— ఎప్పుడో పదివేల సంవత్సరాల క్రితం, మార్గశిరమాసంలో, మకరసంక్రాంతిలో సూర్యదర్శనం లభించే యుగంనాటి విషయాలివి. ఆరునెలల గాఢ రాత్రం తర్వాత వెలుగుకోసం ఉత్తర ధ్రువంలో వున్నప్పటి మన పూర్వులు వెలుగుకోసం, ఎండకోసం ఎంతగా ఆరాటపడ్డారో పాపం! ఆ ఆరాటాలు నేడు స్కాండినేవియా ప్రజల అనుభవాలతో మనకు ధ్రువపడుతున్నాయి. సూర్యగతిని, చంద్రగతితో లెక్కలుకట్టి సమన్వయించి నప్పుడు, సూర్యునిరాశి ప్రవేశం ఏకాదశి తిథినాడు, ఏక కొంచెం ముందువెనుకలుగా జరిగిన కారణంగా కాబోలు ఏకాదశి ప్రాధాన్యం వచ్చింది. సూర్యదేవుడు కొన్ని ప్రాంతాలలో గాఢమగా, మరి కొన్ని ప్రాంతాలలో వారాలపాటుగా స్థిరపడిన తర్వాత, ఈ ఏకాదశులు హరివాసర లయ్యాయి. ప్రతి ఏకాదశి సూర్యగతితో సంబంధం కలదిగా మనవారు గుర్తించారు. వైకుంఠఏకాదశి అలాగే ఆరు నెలల చీకటి గుయ్యారంనుంచి వెలుగుకు వెళ్ళనిచ్చేది గనుక, వైకుంఠ ద్వారం, సుఖసంతోష కాంతిద్వారం అయింది. మన పండుగల, పర్వాల అంతర్యం గ్రహించి చేసినప్పుడే, విజ్ఞానం కలిగి, చాందసాలు, మూఢవిశ్వా

# షెడ్యూల్డ్ ప్రాంతమా?

తెలంగాణా నాయకులు చేసే ఉపన్యాసాల లోనూ, వాటిని విని — చదివి పత్రికలకి రాసేవారి ఉత్తరాలలోనూ ఒక ధోరణి కని పిస్తుంది—

'ఆంధ్రప్రాంతంవారు తెలంగాణాకి వచ్చి తెలంగాణావారికి రావలసిన ఉద్యోగాలని కాజేశారు' అన్న ధోరణి.

ఇది వింతధోరణి! ఆంధ్రప్రాంతంవారు తెలంగాణా ప్రాంతం కూడా 'తమ' రాష్ట్రం అయిన 'ఆంధ్రప్రదేశ్'లో ఒక భాగమే అని అందరూ అనగా విని—చదివి, నమ్మి ప్రభుత్వం ఉద్యోగాలు ఇస్తేనే వాటిలో చేరారు.

భారతదేశంలో షెడ్యూల్డ్ తరగతుల వారికి ఒక ప్రత్యేక స్థాయి ఏర్పరచి వారికి ఉద్యోగాలలో ఒక శాతం ఇస్తున్నారు. తెలంగాణావారికి అటువంటి స్థాయి కావాలంటే (కావాలంటున్నారనే అనిపిస్తుంది కూడా) 'ఆంధ్రప్రదేశ్'లో ఉండే మొత్తం ఉద్యోగాలలో ఒక శాతం వారు తమకి కావాలని కోరవచ్చు.

అంతేగాని, ప్రభుత్వం ఇచ్చిన ఉద్యోగాలని బట్టి ఒకే రాష్ట్రంలో ఒకభాగం నుంచి మరొక భాగంలోకి వచ్చినవారిని 'మాకు అన్యాయం చేశారు' అని దూషించటం ఆశ్చర్యకరంగా ఉంటుంది.

'ఆంధ్రప్రదేశ్' అనే ఒక రాష్ట్రం ఉన్నదని ఒప్పుకున్న తరువాత అందులో ఒక ప్రాంతానికి 'షెడ్యూల్డ్‌స్థాయి' ఇవ్వటం కూడా ఆశ్చర్యకరంగా ఉంటుంది. అసలు ఇదంతా ఉన్మాదం.

తెలంగాణావారికీ—ఆంధ్రప్రాంతం వారికీ మధ్య ఇంతదాకా భావసమైక్యత ఏర్పడ లేదు.

1969 లో జరిగినదంతా ఈ ప్రాంతాల వారి మధ్య ద్వేషాలని పెంచాయే కాని తగ్గించలేదు.

కొన్ని అపోహలకి లోనయి 1969 లో తెలంగాణాలో ఎందరో అక్కడ ఉద్యోగాలు చేస్తున్న ఆంధ్రప్రాంతం వారిని హింసించి తరిమివేశారు.

ఇంత జరిగిన తరువాత భావసమైక్యత ఏర్పడుతుందని అనుకోవటం లోకజ్ఞానం తక్కువ అనిపించుకోవటమే అవుతుంది.

'నాగరికత కలవారు' అనిపించుకోవాలని కోరుకునేవారు జర్మనీలో యూదులని, అమెరికాలో నీగ్రోలని, పాకిస్థాన్‌లో హిందువులని, నాగాలాండ్‌లో అనియాజాతి వారిని ద్వేషించి, హింసించినట్లుగా హింసించా లనుకోరు.

ఒక విలేఖరి
(మదరాసు)



ప్రత్యేక ఆంధ్రకోసం బందరులో మహిళల ఊరేగింపు దృశ్యం.

## హైదరాబాద్...

...సాలు తొలగిపోతాయని నా నమ్మకం:

### నానాత్వంలో ఏకత్వం

'భారతదేశానికి ఉజ్జ్వలమైన సంస్కృతి ఉన్నది. కాని, భారతప్రజలు ఇటీవల మహా సంకుచిత హృదయులు, స్వార్థపరులూ అవుతున్నారు' అని భారతీయ విద్యాభవన్‌లో రామకృష్ణ మిషన్ ప్రముఖులు స్వామి రంగనాథానంద్‌జీ డిసెంబర్ 14 న ప్రసంగించినప్పుడు కొందరికి ఆగ్రహం కలిగించేదేమో కాని, ఆయన మాటలు మువ్వాఁటికీ నిజం. స్వామి రంగనాథానందజీ మహా విద్వాంసుడు, గొప్ప వక్త, తత్త్వవేత్త. 'ప్రస్తుతం మనకు రెండు భారతదేశాలున్నాయి — ఒక్కటి సంస్కృతి, ఆధ్యాత్మిక చింతన, ఉన్నత హృదయం తొణికిసలాడుతూ, మన సంస్కృతి మనకు బోధించిన అంతరాత్మను, గౌరవించే అమరభారత్. రెండవది—దీనికి భిన్నమైనది, స్వార్థంతో, ప్రాంతీయ దురభిమానంతో మత వరిధితో సంకోచించుకొని పోతున్నట్టిది.' అని ఆయన విచారం ప్రకటిస్తూ, గుడ్డిగా పాశ్చాత్య సంస్కృతిని అనుకరించవద్దని, యుగయుగాలుగా నానాత్వంలో ఏకత్వానికి ప్రతీక అయిన భారతదేశానికి ప్రపంచంలో అసదృశస్థానం వుందని ఆయన హితవు చెప్పారు. కాని, నామట్టుకు నాకు ఇతర సంస్కృతులలో మంచివనిపిస్తాయి. మనం మనిషిలోను, కుక్కలోను ఆత్మను, పరమాత్మను చూస్తూ, జీవితంలో మాత్రం మనిషిని కుక్కకన్నా హీనంగా చూస్తాము. సైకి త్రిమత సిద్ధాంతాలూ వల్లిస్తాము; ఆచరణలో మనం మనమే; మన హృదయం ఒక్క మిల్లీ మీటరయినా ముందుకు సాగదు. అలాంటప్పుడు, మనం చిలకపలుకుల్లా పుస్తకాలలోని మాటలు చెబితే ఏం జరుగుతుంది! ఇతర మతాలు చెప్పినవి ఆచరిస్తున్నాయి, కొంతకు కొంతయినా. మనం చెప్పేదొక్కటి, చేసేదొక్కటేని — ఇప్పుడేకాదు, యజుర్వేదకాలంనుంచి. వృత్తికులంగా మారడమనేది మనజాతి, సంఘాల ప్రాచీనతమ స్థితికి, సంఘవికాస పరిణామానికి నిదర్శనము, వరితకారులను సంతోషపెట్టవచ్చునేమో! మన ఆధ్యాత్మిక ప్రవచనాలు, ఆచరణ ఒక్కటి అయినప్పుడే, మన ప్రవచనాలన్నీ సార్థకమవుతాయి

### కొత్త టెలిఫోన్ ఎక్స్చేంజ్

గవర్నర్ శ్రీ ఖండూభాయిదేశాయి డిసెంబర్ 16 న ముషీరాబాద్‌లో కొత్త టెలిఫోన్ ఎక్స్చేంజికి ప్రారంభోత్సవం జరుప

(60 వ పేజీ చూడండి)

## ఆంధ్రదేశ భవిష్యత్తు

దివాకర్ల వేంకటసుబ్బారావు

ఈనాడు ఆంధ్రులు తమ గౌరవ ప్రతిష్ఠల కాపాడుకొనుటకు త్యాగము గావించ సమకట్టారు. ప్రజలు ముక్త కంఠంతో ఆంధ్రదేశం కావాలని పట్టుదలగా ఉన్నా ప్రభుత్వంవారు ఇది ప్రజాభిప్రాయం కాదంటున్నారు. ఎవరి పాట వారిదిగా ఉంది. ప్రజాభిప్రాయం ఏ రీతిగా ఉంటుందో నిర్ధారణం కాన్పించదు, చెప్పరు. ఎలా ఉన్నా ఆంధ్రుల భవిష్యత్తు ఏ రూపం పొందుతుందని పలువురు మిత్రులు కోరగా నాకు తోచిన మాటను వ్రాస్తున్నాను.

ఆంధ్రదేశ రాశి మీనమని అంటారు. ప్రస్తుతస్థితి విచారిస్తే లగ్న రాజ్యాధిపతి గురువు దశమ కేంద్రస్థమైన మూల త్రికోణంలో రాహుగ్రస్తుడై ఉన్నాడు. ఇది చండాల యోగమని శాస్త్రం చెపుతోంది. గురువు మంచివాడైనా, ఉత్తమ బ్రాహ్మణుడని పూర్వ శాస్త్రకారులు చెప్పినా చండాలయోగం పొందినందున నీచగుణాన్వితుడగుచున్నాడు. అనగా క్రమమార్గ ఆలోచనాశక్తి నశించి తామస ప్రధానుడై ఉంటాడని చెప్పాలి. హంసయోగమందున్నా మండల గ్రహాల బలహీనత వలన శుభ ఫలదాత గాడని శాస్త్ర ప్రమాణం. ఈ లగ్న యోగకారకుడు కుజుడు 22–12–72 న స్వక్షేత్రవర్తియై 26 నుండి అనూరాధా (శని) నక్షత్రచార వలువుచూ 16–1–73 నుండి శని దృష్టి పొందుచున్నాడు. వృశ్చిక (స్వక్షేత్ర) చార అనుకూల ప్రదమైనా శని కుజుల పరస్పర దృష్టి అధిక దోష యుతం అగుచున్నందున అనేక చిక్కులు, శ్రమ, వ్యయప్రయాసలు ఆందోళనలు ప్రాప్తింపగలవని శాస్త్ర ప్రమాణం. తగాదాలు, స్వాభిలాష, అతి తీవ్రత, తొందరపాటు, అనాలోచిత కార్యాచరణము, పగ తీర్చుకొనవలెనను ఉద్రేకత, కష్టములు తప్పవు. 2–2–73 వరకు అశుభకాలం. గురువు 26-1-73 న మకర ప్రవేశం. ఇది నీచస్థానం. గురు, కుజులు 18–3–73 నుండి మకరంలో ఉంటారు. ఈ స్థితి శుభప్రదం. లాభ వ్యయాధిపతిగా శని వృషభంలో గురునకు షష్ఠాష్టక స్థితి నొందినంతవరకు అశుభం. అనంతరం ఏప్రియల్ నుండి వారలకు పరస్పర కోణస్థితి ప్రాప్తించుట, గురువు శనిని వీక్షించుట శుభప్రదం. కుజాని వృశ్చిక స్థితి కాలంలో లోహమూర్తిగా నుండుట, గురువు మకర ప్రవేశం నుండి లోహమూర్తి యగుట గమనార్హం. కుజుడు 18–3–73 నుండి ఉచ్చక్షేత్ర (మకర) మందు సువర్ణమూర్తిగా సర్వతోముఖ శుభ ఫలదాత. ఆనాటినుండి అనగా షుమారు ఏప్రియల్ నుండి మనోవాంఛా ఫలస్థితి కనుకూలప్రదమైన కాలం అని భావింపవచ్చు. ప్రజా ప్రతినిధికి శుభ గురు దృష్టి, గురునకు యోగకారక, సువర్ణమూర్తియగు ఉచ్చ కుజుని యుతి లాభముదు ప్రాప్తించుట శాస్త్రరీత్యా ఉత్తమ ఫల మూలమని పాఠకులు గ్రహింపగలరు.

# అపరచాణక్యుడు (రాజాజీ)

పది సంవత్సరాలకు జరగబోయేదాన్ని ముందు ఊహించి దానికి తగిన ప్రణాళిక వేసి పని సాధించడం అనే ప్రతిభ కలవారిలో రాజాజీకి ప్రథమస్థానం అంకితమైపోయింది. స్వతంత్రములూ, నిర్భీకములూ అయిన భావాలుగల వ్యక్తులు నేను తెలుసుకున్నంత వరకూ యిద్దరే యిద్దరు. వారు ప్రకాశం, రాజాజీ... ప్రతిఘటన కనిపించకుండా ప్రతిఘటించి ప్రజల నేత కానవిపించుకున్న ప్రతిభాశాలి రాజాజీ. అల్పసంఖ్యాక వర్గమైన ముస్లింలీగుకి రూపుదిద్ది ప్రాణం పోసి నిటారుగా నిలబెట్టిన మేధావి రాజాజీ. భారత విభజన పట్టుపట్టి ఆనాడు రాజాజీ చేయించకపోతే స్వతంత్ర భారతం అవతరించేది కాదంటే ఉపజ్ఞ కలవారు కాదనలేరనుకుంటాను. ప్రజాబలం వల్ల పరిపాలకులు కావచ్చు! రాష్ట్ర క్షేమం కోసం విశాలదృష్టితో, ధైర్యసాహసాలతో పరిపాలించడం ఒకొక్కప్పుడు సాధ్యంకాక పోవచ్చు. రాజాజీ విషయములో అది పరాస్తమైపోయింది. హైదరాబాదు సంస్థానాన్ని స్వతంత్ర భారతదేశంతో విలీనం చెయ్యడములో, రజాకార్ దౌర్జన్యాన్ని మట్టిలో కలపడంలో ఇండియా గవర్నర్ జనరల్‌గా ఆయన ఉన్నప్పుడు చూపిన చాకచక్యం ఈ ప్రతిభాశాలికి అపర చాణక్యుడుగా చరిత్రలో ప్రత్యేక స్థానమిచ్చి నివాళిపట్టింది. ఆయన రాజకీయ తంత్రజ్ఞత, దక్షత చెప్పాలంటే ఒక గ్రంథమవుతుంది.

సాహిత్య విషయములోగాడా ఈ విద్వాంసుడు సర్వతోముఖ పాండిత్యంకల ఉద్దండుడు. దానికి ఆయన రామాయణ భారతాలు స్పష్టమైన సాక్ష్యం యిస్తాయి. నేను తెలుగులో భాగవతం రాస్తూన్నప్పుడు ఒకనాడు పిలిపించి కపిలదేవహూతి సంవాదంలో జీవోత్పత్తి ఘట్టాన్ని విమర్శించి 'నీవు దేనిని ఆధారంగాచేసి రాశావు? సంస్కృతములోగాని, పోతనగారి భాగవతంలో నీవు రాసిన విషయం కొంత కనిపించదే—' అన్నాడాయన. ఎందుకడిగాడో తెలియక కొంచెం భయపడ్డాను. అంతలోనే ధైర్యం తెచ్చుకొని 'నా మనస్సు చెప్పింది రాశాను' అన్నాను. 'మంచిది. నీ రాత బాగున్నది. శుభమస్తు—' అన్నాడాయన. నిజంగానే ఆనాటనుంచి నారాత రెండువిధాలా బాగున్నాది. ఒకప్పుడు నా పుస్తకాలు కొన్ని ఆయనకివ్వడానికి వెళ్ళి నమస్కరించి యిచ్చాను. 'చేవ్రాలు చేసియిచ్చావా?' అన్నాడు నవ్వుతూ. 'ఆహా!' అన్నాను. ఆయన తెలుగు అనువాదాలు రామాయణ భారతాలు నాకిచ్చాడు. 'చేవ్రాలు చేశావా' అన్నాను. 'గట్టివాడవు. అడుగుతావని తెలుసును. చేశాను' అన్నాడు చిరునవ్వునవ్వి. ఇలాగే అప్పుడప్పుడు కలిసేవాళ్ళం... ఆయన తెలుగు అనువాదం భగవద్గీతపై నా సమీక్ష వినిపించి 'పొగడ్త కొంచెం తగ్గించి రాస్తే బాగుండును. బాగానే రాశావు' అన్నాడు. 'మీరు ఉత్త గోపాలుడుకాదు రాజగోపాలుడు—' అన్నాను. సూటిగాచూసి చిరునవ్వు నవ్వాడు ఆయనకు శ్రీ నారాయణ దాసుగారు, శతావధాని వేంకటశాస్త్రి గురుపాదులు మొదలైన మహానుభావులు మిత్రులు. వారినిగూర్చి చెప్పినప్పుడు హృదయంవిప్పి. నేనన్నా, మా పిల్లలన్నా ఆయనకెంతో ఆప్యాయత. అందునా మా రెండోవాడు ఆనందంఅంటే ఆయనకి ఎంతో యిష్టం తాతంటే వాడికి ఒళ్ళుతెలియని మమత.

ఈనాడాయన పరమపదించడం మా పితృపాదులు అస్తమించినట్లున్నది. ఆయన కుటుంబానికి నా సానుభూతి.

సర్వేశ్వరుడు రాజాజీ ఆత్మకు శాంతిని ప్రసాదించవలసిందని ప్రార్థిస్తున్నాను.

— **యామిజాల పద్మనాభస్వామి**






'మన ప్రాంతంలో ప్రత్యేక రాష్ట్రం కోసం జరుగుతున్న ఉద్యమంలో కొంత మంది మంత్రులు పాల్గొంటున్నారు కాని మరికొంతమంది మంత్రులు ఈ ఉద్యమాన్ని వ్యతిరేకిస్తున్నారు. అలాగ వ్యతిరేకిస్తున్న మంత్రులలో ఒకరైన శ్రీమతి భవనం జయప్రద తే 11-12-72 దీని ఒక ప్రకటన చేసింది. ప్రత్యేక రాష్ట్రోద్యమాన్ని ఆమె వ్యతిరేకించడానికి గల కారణం ఆ ప్రకటనలో ఉంది' అన్నాడు చిదంబరం.

'ఏమిటా ప్రకటన?' అని ప్రశ్నించాడు చంచ్రలావు.

'ప్రత్యేక రాష్ట్రవాదులు తమ యింటి మీద జరిపిన దాడిని ఖండిస్తూ ఆమె యిలాగ అంది. 'భారతదేశంలో ప్రతి పౌరునికి తాను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి ఉండేటటువంటిన్నీ, వాటిని గురించి ప్రచారం చేసుకొనేటటువంటిన్ని స్వేచ్ఛ ఉన్నదనీ, అలా సిద్ధాంతాలు కలిగినవారు తాము నమ్మిన సిద్ధాంతాలకోసం దౌర్జన్య చర్యలకు గురిఅయినా, హింసింపబడినప్పటికి కూడా, అచంచలమైన వారి పథంనుండి ఎప్పటికీ వెనుకంజవేయరు...సమైక్య ఆంధ్ర రాష్ట్రంలోనే తెలుగు ప్రజల సౌభాగ్య సంపదలు, అభ్యుదయం ఆధారపడి ఉన్నవని నమ్ముతున్నాను. ప్రధానమంత్రి పంచసూత్ర ప్రణాళిక ఉభయప్రాంత ప్రజలకు న్యాయం కలగజేయగలదని విశ్వసిస్తున్నాను' అని మంత్రి జయప్రద ఒక ప్రకటన చేసింది' అంటూ చిదంబరం ఇంకా యిలాగ అన్నాడు.

'భారతదేశంలో అందరికీ భావ ప్రకటనా స్వాతంత్ర్యం ఉండగా! అందుచేత ఆంధ్ర ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతున్నప్పటికీ, మంత్రి జయ

ప్రతి సమైక్యరాష్ట్రాన్ని కోరుతున్నది. అందులో తప్పేముంది? తన యిష్టం వచ్చిన అభిప్రాయాలు కలిగి ఉండడానికి ఆమెకు హక్కులేదా?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'మంత్రి జయప్రదచేసిన ప్రకటన వినగానే నాకు ఒక బంగళా కాపలాదారు అన్న మాటలు గుర్తుకు వచ్చాయి' అన్నాడు చూడామణి.

'ఏమిటా కాపలాదారు అన్నమాటలు?' అని చంచలావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక ఊళ్ళో ఒక పెద్ద బంగళా ఉంది. ఆ బంగళాకు రాత్రిపూట కాపలా కాయడానికి ఒక కాపలాదారు ఉన్నాడు. రాత్రి పదిగంటలు కాగానే బంగళా గేటుకు తాళం వేసి, రాత్రంతా బంగళాకు కాపలా ఉండడం అతని విధి. ఒకనాటిరాత్రి రెండుగంటలకు బంగళాలోనికి దొంగ ప్రవేశించినట్లుగా బంగళాలోనివారు అనుమానించారు వెంటనే బంగళాలోనుంచి ఒక వ్యక్తి కాపలావాని వద్దకువచ్చి 'లోపలకు రమ్మన్నాడు

కాపలాదారు అప్పుడు నిద్రమత్తులో ఉండి యిలా అన్నాడు 'ఇప్పుడు రాత్రి రెండుగంటలు అయింది. అందరూ నిద్రపోయే సమయం ఈ సమయంలో నిద్రపోవడం జీవకోటికి ప్రకృతి ప్రసాదించిన వరం అందుచేత నేను యిప్పుడు నిద్రపోవాలి. అది నా జన్మహక్కు' అని కాపలాదారు అన్నమాటలను వివరించాడు చూడామణి.

'అవును అందులో తప్పేముంది?' అని అడిగాడు చంచలావు.

'రాత్రి రెండుగంటలకు నిద్రపోవడం అందరకూ జన్మహక్కు అన్నమాట వాస్తవమే కాని అది ఆ కాపలాదారుకు వర్తించదు. అతను ఆ బంగళా కాపలా కాయడానికి జీతం తీసుకొంటున్నాడు. అందుచేత అతనికి కొన్ని బాధ్యతలు ఉన్నాయి. రాత్రిపూట మెలకువగా ఉండి బంగళాలోనికి యితరులు రాకుండా చూడడం అతని విధి. ఒకవేళ యే దొంగైనా బంగళాలో ప్రవేశిస్తే, ఆ దొంగను పట్టుకోవడం ఆ కాపలాదారు బాధ్యత. ఆ కాపలాదారు తన బాధ్యతను మరచిపోయి,హక్కును గురించి మాట్లాడడం హాస్యాస్పదం కాదా? ఆ పని వదిలివేసినట్లయితే అతనికి యే బాధ్యతా ఉండదు. తన యిష్టం వచ్చినట్లుగా అతను అప్పుడు నిద్రపోవచ్చుగాదా!' అన్నాడు చూడామణి.

'నువ్వు చెప్పింది బాగానే ఉంది కాని మంత్రి జయప్రద ప్రకటన వినగానే నీకు ఆ కాపలాదారు మాటలు యెందుకు గుర్తు వచ్చాయి?' అని అడిగాడు చిదంబరం.

'మంత్రి జయప్రద మాటలుకూడా ఆ కాపలాదారు మాటల్లాగే ఉన్నాయి' అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'మంత్రి జయప్రద చెప్పినట్లుగా భారతదేశంలో ప్రతిపౌరునికి తాను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి ఉండేటంవంటి స్వేచ్ఛ ఉన్నది కాని ఆ స్వేచ్ఛ ఆమెకు పూర్తిగా వర్తించదు. ఎందుకంటే ఆమె ప్రజాప్రతినిధి. ప్రజాప్రతినిధిగా ఆమె జీతాన్ని యితర సౌకర్యాలను కూడా పొందుతున్నది. అందుచేత ఆమెకు కొన్ని బాధ్యతలు ఉన్నాయి ప్రజలయొక్క అభిప్రాయాలను ప్రతిబింబించడమే ప్రజాప్రతినిధుల బాధ్యత ఏ ప్రజలకు ఆమె ప్రాతినిధ్యం వహిస్తున్నదో, ఆ ప్రజలందరూ ప్రత్యేకరాష్ట్రాన్ని కోరుతుండగా, ఆమె సమైక్యరాష్ట్రాన్ని కోరడం ఆమె తన బాధ్యతను విస్మరించడం కాదా? ఆమె అది తన హక్కు అనడం హాస్యాస్పదం కాదా? ఆమె తన మంత్రిపదవికి శాసనసభ్యత్వానికి రాజీనామా యిచ్చేస్తే ఆమెకు ఏ బాధ్యతా ఉండదు అప్పుడు ఆమె ప్రజల అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా తన వ్యక్తిగతమైన అభిప్రాయాలను ప్రకటించుకోవచ్చును. ప్రచారం చేసుకోవచ్చును' అన్నాడు చూడామణి.

'అయితే యింకో సమస్య వస్తుంది. ప్రజాప్రతినిధి యొక్క వ్యక్తిగత అభిప్రాయాలకు ఆ ప్రతినిధిని యెన్నుకొన్న ప్రజల అభిప్రాయాలకు భేదం వచ్చినప్పుడు యేం చెయ్యాలి?' అని అడిగాడు చిదంబరం.

'ఆ పరిస్థితిలో ప్రజాప్రతినిధి తన అభిప్రాయాలే ప్రజల అభిప్రాయాలకంటే యెక్కువగా ప్రజాశ్రేయస్సుకు దోహదం చేస్తాయో ప్రజలకు నచ్చచెప్పి, వారిని ఒప్పించాలి. అప్పటికీ ప్రజలు తమ ప్రతినిధి అభిప్రాయాలను అంగీకరించకపోతే, ప్రజాప్రతినిధే తన అభిప్రాయాలను ప్రజాభిప్రాయానికి అనుగుణంగా మార్చుకోవాలి. ప్రజాప్రతినిధి తన అభిప్రాయాలను మార్చుకోవడానికి యిష్టపడకపోతే, తన పదవికి రాజీనామా యిచ్చివేయాలి. అంతేకాని యే వ్యక్తికీ అతను ప్రజాప్రతినిధిగా ఉన్నంతవరకూ, ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా ప్రవర్తించే హక్కులేదు' అని ఖచ్చితంగా చెప్పాడు చూడామణి.

'అది సరేకాని ఈ ముల్కీ నిబంధనలు 1977వ సంవత్సరం ఆఖరువరకు మాత్రం హైదరాబాదు పట్టణంలోను, 1980వ సంవత్సరం ఆఖరువరకు మిగిలిన తెలంగాణా ప్రాంతంలోను అమలులో ఉంటాయి అంటే యింకా యెనిమిది సంవత్సరాలపాటు మాత్రం యీ ముల్కీ నిబంధనలు అమలులో ఉంటాయి. ఈ కొద్ది సంవత్సరాలపాటు ఉండే ముల్కీ నిబంధనలకోసం మొత్తం రాష్ట్రాన్ని విడగొట్టమనడం యెందుకు? ఈ ముల్కీ నిబంధనల గడువులు అయిన తరువాత మళ్ళా పొడిగించడం జరగదని ప్రధానమంత్రిణి ఇందిరాగాంధి లోక్‌సభలో స్పష్టంగా ప్రకటించింది. అందుచేత తెలంగాణ ప్రాంతంవారు యింకా కొద్ది సంవత్సరాలపాటు యెలాగో ఓపికపడితే, అన్నీ సర్దుకొంటాయి కదా!' అన్నాడు చిదంబరం.

'ఈ ముల్కీ నిబంధనల గడువులు అయిన తరువాత మళ్ళా పొడిగించడం జరగదని ప్రధానమంత్రిణి యిందిరాగాంధీ అన్నది' అని నువ్వుచెప్పగానే 'నందోరాజా భవిష్యతి' అని చెప్పుకొనే కథ నాకు జ్ఞాపకం వచ్చింది' అన్నాడు చూడామణి.

'ఏమిటా కథ?' అని చంచలావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

చాలకాలం క్రిందట ఒక దేశాన్ని ఉత్తుంగభుజుడు అనే రాజు పాలిస్తుండేవాడు. అతనికి చాలామంది రాణులు ఉండేవారు. వారిలో పెద్దరాణికి నందుడు అనే కొడుకు ఉన్నాడు. ఉత్తుంగభుజుని అనంతరం నందుడు రాజు కావలసిఉంది.

ఆ పరిస్థితిలో ఒకనాడు ఒక రత్నాల వర్తకుడు చాలా విలువగల రత్నహారాన్ని తీసుకొనివచ్చి పెద్దరాణికి చూపించాడు.

పెద్ద రాణికి ఆ రత్నహారం నచ్చింది. ఆమె దాన్ని కొందామని అనుకొంది. కాని

(18వ పేజి చూడండి)

## పెద్దకథ:




(గత సంచిక తరువాయి)

ఓరోజు ఉదయం పార్వతమ్మ పక్క మీద నుండి లేవలేకపోయింది. వళ్ళు కాలే జ్వరం, దానికితోడు వళ్ళంతా నొప్పులు వచ్చినాయి. అప్పటికి సరస్వతమ్మే అన్నం వండింది. ఆవిడ పిలిచాక, సారధి భోజనానికి వెళ్ళాడు. నాలుగుమెతుకులు కొరికి భోజనం అయిందనిపించి లేస్తూ,

'ఇంతపొద్దెక్కేవరకు నువ్వు చేశావేమిటి అమ్మమ్మా?' అన్నాడు.

'మీ అమ్మకు జ్వరం తగిలింది...'

సారధి ఆత్రంగా తల్లి గదిలోకి వెళ్ళాడు. ఆవిడ కళ్ళుమూసుకుని నిద్ర పోతున్నది. తల్లి వంటిమీద చెయ్యివేసి చూశాడు సారధి చురుక్కుమన్నది. వెంటనే డాక్టరు రామారావుగారింటికి బయలు దేరాడు.

సారధి వెళ్ళేసరికి హేమసుందరి వరండాలో నాలుకుర్చీలో కూర్చుని వారపత్రిక చదువుతున్నది. సారధిని చూసీచూడడంతోనే, ఆమెకళ్ళు ప్రకాశవంతమయినాయి. లేచి నిలబడి,

'కూర్చోండి.' అని చెప్పి లోపలికు వెళ్ళింది.

'నీకోసం ఎవరో వచ్చారు నాన్నా...' అన్నది తండ్రితో.

'ఎవరమ్మా...'

హేమసుందరి సారధి పేరు చెప్పడానికి సిగ్గుపడి,

'నువ్వువెళ్ళి చూడు నాన్నా...' అన్నది.

రామారావుగారు నవ్వుతూ వరండాలోకి వెళ్ళారు. సారధిని చూసి,

'మీరా సారధిగారూ?...' అన్నారు.

సారధి ఆయనకు 'విష్'చేసి,

'మా అమ్మగారికి జ్వరం వచ్చిందండి...' అన్నాడు.

'ఇప్పుడే వస్తాను కూర్చోండి.' అంటూ లోపలకు వెళ్ళారు రామారావుగారు.

కొద్దిక్షణాల తరువాత రామారావుగారు 'డ్రస్సు' మార్చుకుని, వరండాలోకి వచ్చి, 'పదండి...' అన్నారు

సారధి లేచి, ఆయనను అనుసరించాడు హేమసుందరి వాళ్ళిద్దరినీ చూస్తూ వరండాలో నిలబడ్డది.

రామారావుగారూ, సారధీ ఒకరిపక్క ఒకరు నడుస్తున్నారన్నమాటేకాని, వాళ్ళిద్దరిమధ్యా మాటలు లేవు చివరకు రామారావుగారు అన్నారు:

'మీ అమ్మగారికి ఎప్పటినుండీ జ్వరం?'

'రాత్రి మామూలుగానే ఉంది... పొద్దున్నటికి వచ్చింది...'

మళ్ళీ కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

'మీ సెలవు ఎంతవరకూ ఉంది?...'

'సెలవు తీసుకున్నాను... ఇంకా ఇరవై రోజులపైన ఉంది...'

ఇంతలో ఇల్లు వచ్చింది.

రామారావుగారు పార్వతమ్మను పరీక్షించారు, సారధి ఆత్రుతనిండిన స్వరంతో,

'మరేమీ భయంలేదు కదా డాక్టరుగారూ...టెంపరేచర్ బాగా ఉన్నట్టుంది...' అన్నాడు.

'కంగారుపడాల్సిందేమీ ఏమీలేదండి... మామూలు జ్వరమే... రెండుమోతాదుల మందు పడితే అదే తగ్గుతుంది.. మీ పని క్కుర్రాడిని మందుకు పంపండి...'

రామారావుగారు వెళ్ళిపోయారు మందు తేవడానికి రాముడు బయలుదేరాడు వెళ్ళాడు. రామారావుగారు వాడికి మందు ఇచ్చి పంపారు.

రాజ్యలక్ష్మమ్మ వర్దాను చూస్తూ,

'పొద్దున్నే పార్వతమ్మగారింటికి వెళ్ళారేమిటి? ఆ మందు ఎవరికి?...' అన్నది.

రామారావుగారు 'డ్రస్సు' మార్చుకుంటూ,

'పార్వతమ్మగారికి జ్వరం తగిలింది...' అన్నాడు.

'అయ్యోపాపం...పాపం ఆ పిల్లాడు ఏం అవస్థపడుతున్నాడో సరస్వతమ్మగారు దెబ్బయ్యేళ్ళు పైబడినావిడ...'

హేమసుందరి వాళ్ళ సంభాషణ వింటూ నిలబడ్డది.

ఆ మధ్యాహ్నం,

'పార్వతమ్మగారిని ఓసారి చూసివస్తానమ్మా...' అన్నది హేమసుందరి తల్లితో.

'అట్లాగే వెళ్ళవే తల్లీ..' అన్నది రాజ్యలక్ష్మమ్మ.

హేమసుందరి పార్వతమ్మ ఇంటికి

బయలుదేరింది. సారధి తనగదిలో ఉంటా డన్న ఊహతో ఆమె తిన్నగా పార్వతమ్మ గదిలోకి వెళ్ళింది. పార్వతమ్మ మంచంమీద పడుకుని దూలాలవైపు చూస్తున్నది. సారధి ఆ ప్రక్కనేఉన్న కుర్చీలో కూర్చుని ఉన్నాడు. వాళ్లిద్దరిమధ్యా మాటలులేవు. హేమసుందరి గాజుల గల గల వినిపించి, సారధి తలెత్తి చూశాడు హేమసుందరి గుమ్మం దగ్గర నిలబడి ఉన్నది. సారది లేచి, తన గదిలోకి వెళ్లిపోయాడు. హేమ సుందరి గదిలోకి వచ్చి, కుర్చీ పార్వతమ్మ మంచం దగ్గరకు జరుపుకుని కూర్చున్నది. పార్వతమ్మ ఆమె వైపుచూసింది. ఆవిడ కళ్ళల్లో నీళ్ళు నిండుకున్నాయి.

'మీ వంట్లో ఎలా ఉంది?...'

పార్వతమ్మ నిట్టూర్చింది. తన జ్వరం సంగతి వీళ్ళందరకూ తెలుసు, తన మనసులోని బాధ వీళ్లెవరికీ తెలియదు.

'కాఫీ అయ్యాయా...?'

'ఇంకా కాలేదు... అమ్మ ఇప్పటి వరకూ పనిచేసి పడుకుంది...'

హేమసుందరి మారు మాట్లాడక లోపలకు దారితీసింది. కొద్దిసేపట్లో కాఫీ తయారు చేసింది. సరస్వతమ్మకూ, పార్వతమ్మకూ ఇచ్చింది.

'నువ్వు తీసుకున్నావా హేమా?...' అన్నది పారతమ్మ.

'నాకు మీ ఇంట్లో మొహమాటంలేదు' తీసుకుంటాను...'

'వాడికి కూడా ఇచ్చేసిరా హేమా...'

'అలాగే...'

హేమసుందరి కాఫీగ్లాసుతో సారధి గదిలోకి వెళ్లింది అతడు కళ్ళు మూసుకుని కుర్చీలో కూర్చుని ఉన్నాడు. హేమసుందరి తన ఆగమనాన్ని సూచిస్తూ చిన్నగా దగ్గింది. సారధి కళ్ళుతెరచి, ఒక్కక్షణం



ఆమె వైపు చూసి చూపులు మరల్చు కున్నాడు. ఆమెను చూస్తూంటే అతడికి ఆమెపై కసి, కోపమూ కలిగాయి. ఈ అమ్మాయిని మనసులో పెట్టుకునే కద తనమాటను కాదంటున్నది తల్లి. ఆ విషయాన్ని చెప్పక, పిచ్చి పంతపారం పర్యం వస్తుందనే మిషతో ఒడ్డుంటున్నది. ఈ అమ్మాయి తనకూ, నీరజకూ మధ్య నిలచిన అడ్డుగోడ!

'కాఫీ తీసుకోండి...'

హేమసుందరి మృదువుగా అనేసి, కాఫీ గ్లాసు బల్లమీద పెట్టి పార్వతమ్మ గదిలోకి వెళ్ళి కూర్చున్నది. కొద్ది క్షణాల తర్వాత సారధి బట్టలు మార్చుకుని బయటకు వెళ్ళి పోయాడు. ఖాళీ గ్లాసు తేవడానికి అతడి గదిలోకి వెళ్ళింది హేమ సుందరి. సారధి కాఫీ త్రాగలేదు—గ్లాసు తను ఎలా పెట్టిందో అలాగే ఉన్నది. ఆమెకు అది అవమానంగా తోచింది. కళ్ళల్లో నీళ్ళు వచ్చినాయి. అయితే సారధి అలా ప్రవర్తించ డానికి కారణం ఏమిటో మాత్రం ఆమెకు అర్థం కాలేదు.

'వాడు కాఫీ త్రాగలా హేమా?...' అన్నది పార్వతమ్మ.

'లేదు...ఆయన త్రాగుతారు కదా అని గ్లాసు బల్లమీద పెట్టి వచ్చాను...త్రాగ కుండానే వెళ్ళిపోయారు...'

పార్వతమ్మ దీర్ఘంగా నిట్టూర్చింది.

హేమసుందరి ఆవిడతో కాస్సేపు కబుర్లు చెప్పి, ఇంటికి వెళ్ళిపోయింది.

సారధి పెత్తల్లిగారింటికి వెళ్ళాడు. తల్లికి జ్వరంగా ఉందని చెప్పి,

'అమ్మమ్మ చాలా శ్రమపడుతోంది...' అన్నాడు.

'నేను వస్తానులే తమ్ముడూ ... రిక్షా పిలుచుకుని రా...' అన్నది పద్మావతి.

సారధి రిక్షా తెచ్చేలోపల, పద్మావతి రెండు మూడు రోజులకు సరిపడ బట్టలు ఓ సూటుకేసులో సర్దుకున్నది.

రిక్షా ఇంటిదగ్గర ఆగగానే దిగి, రిక్షా వాడికి డబ్బులిచ్చి,

'నువ్వు లోపలకు పద అక్కా...నేనిప్పుడే వస్తాను ...' అంటూ వెళ్ళిపోయాడు సారధి

పద్మావతి లోపలకు వెళ్ళేసరికి పార్వతమ్మ నిద్రపోవడం లేదు. శూన్యంలోకి చూస్తూ మంచం మీద పడుకుని ఉన్నది.

'ఏమిటి పిన్నీ ... అంత దీర్ఘంగా ఆలో చిస్తున్నావ్?...' అంటూ లోపలకు వెళ్ళింది పద్మావతి.

పార్వతమ్మ నిట్టూర్పు విడుస్తూ,

'ఏమిటే ఇలా వచ్చావ్ పద్మా...' అన్నది.

'నీకు జ్వరం వచ్చిందని పార్థుడు వచ్చి చెప్పాడు...'

'ఏడి...వాడేడి...'

'ఇప్పుడే వస్తానని ఎక్కడికో వెళ్ళాడు.'

'వాడి ప్రవర్తన నాకు అర్థం కావడం లేదే పద్మా...వాడు తిరిగి వచ్చేది రాత్రి పది గంటలకే...'

పద్మావతి మాట్లాడలేదు.

'మధ్యాహ్నం పాపం డాక్టరుగారి అమ్మాయి వచ్చింది...కాఫీ కలిపింది...వాడికి ఇవ్వబోతే త్రాగకుండానే వెళ్ళిపోయాడు... పాపం ఆపిల్ల ఎంతగా నొచ్చుకుందో... అయినా ఏం చేసిందని ఆ పిల్లమీద కక్ష?...'

'నువ్వు అనవసరంగా దిగులు పడకు పిన్నీ...పార్థుడి మనస్తత్వం మనకు కొత్త కాదు...వాడికి వయస్సయితే వచ్చింది; చదువయితే అబ్బింది; ఆఫీసరు ఉద్యోగ మయితే నచ్చింది...కానీ వాడిది పసివాడి స్వభావం పిన్నీ ... పసివాడు ఏదయినా కావాలని మారాం చేస్తాడు...ఇవ్వకపోతే సంబాళించుకోలేడు ... పార్థుడూ అంతే... కొద్దిరోజులు పోతే వాడు నీరజను మరుస్తాడు...మామూలు మనిషవుతాడు...'

పార్వతమ్మ పద్మావతి వైపుచూసి,

'అంతే నంటావా?...' అన్నది.

'అంతే పిన్నీ ... అనవసరంగా మనసు పాడు చేసుకోక కాస్సేపు పడుకో...'

ఆ సాయంత్రానికి పార్వతమ్మ జ్వరం తగ్గలేదు. ఉదయం కన్న ఎక్కువయింది. డాక్టరుగారికి కబురు వెళ్ళింది. ఆయన వచ్చి, ఆవిడను పరీక్షించి, మందులు మార్చారు

రాత్రి సారధి ఇల్లు చేరుకునేసరికి పది గంటలు దాటింది. అతడు వెళ్ళేసరికి పద్మావతి హాల్లో కూర్చుని ఉన్నది.

'ఇంతవరకూ నువ్వు ఎందుకు మెలకువగా ఉన్నావ్ అక్కా...'

పద్మావతి అతనివైపు చూసిందికాని, మాట్లాడలేదు.

'అమ్మకు ఎలా ఉంది?...

'అమ్మకు ఎలా ఉందోనన్న ఆదుర్దా నీకు ఉండి ఉంటే రాత్రి పది గంటల వరకూ తిరగగలిగే వాడివా పార్థా?...

'అక్కా...'

'అవునురా...నేనన్నదానికి సమాధానం చెప్పు...'

'నాకు మనసు బావుండడంలేదు...'

'నీవల్ల తక్కినవాళ్ళ మనసులు బావుండ డంలేదురా...పిన్నికి జ్వరం ఎందుకొచ్చిందో తెలుసా? నిన్ను గురించి మనసు పాడు చేసుకుని, వేళకి నాలుగుమెతుకులు తినక వంటికి తెచ్చుకుందిరా ... పిన్ని జ్వరానికి కారణం మానసిక వ్యథరా...'

'అయితే నన్నేం చెయ్యమంటావ్?...'

'ఏం చెయ్యాలో నీకు తెలియదా?...'

సారధి కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా ఉండి,

'అమ్మ కోరిక ఏమిటో నీకు తెలియంది కాదు...ఆ కోరిక నేనెలా తీర్చగలను?...' అన్నాడు.

'అక్కడే నువ్వు తప్పటడుగు వేశావ్

## ఖాయ్‌! రుధిరపాయ్‌!!

ఆమని వికసిస్తున్నప్పుడు
అగ్నిశిఖలను వర్షించకు!
రాగాలు తీవెలు సాగుతున్నప్పుడు,
తీగెల త్రెంచాలని యత్నించకు!
మనసుల తోటలలో,
మమతల మందారాలు,
కళ్ళు తెరచి చూస్తున్నప్పుడు,
మంచితనం సౌరభాల,
కుంచించుక పోతున్న,
గుండెలను విశాలం చేసి,
కొత్త జీవితానికి,
ఆశల వెలుగుల నందిస్తున్నప్పుడు,
కసితో కరాసి తీసి,
కూరకేళ్ళతో పెకిలించకు
మందారాల ఆధారాలను,
కోసి ముళ్ళను పోయకు
లేతలేతని పూతరేకులను!
నవ్వని జీవితాలకు,
చిచ్చు రగిలించకు!
నడుస్తున్న చరిత్రను,
రక్తాక్షరాలతో లిఖించకు!!

—యస్. మహాలక్ష్మి

తమ్ముడూ, మన అంతస్తు నీకు తెలియంది కాదు; మన పెద్దవాళ్ళు మూఢనమ్మకాలు నీకు తెలియనివి కావు... పిన్నికి ఉన్నదల్లా నువ్వు ఒక్కడివి... అలాంటిది పిన్నితో మాట మాత్రమయినా చెప్పకుండా పెళ్ళి చేసుకుంటానని నీరజకు ఎలా మాటియ్యగలిగావ్?... పోనీ నాతోనయినా ముందుగా చెప్పావా?... అంతా రహస్యంగా ఉంచావ్... నాకు ముందుగానే తెలిసిఉంటే ఈ పరిస్థితి ఇలా తయారయ్యేది కాదు ... ముందే నిన్ను హెచ్చరించి ఉండేదాన్ని... అదే నువ్వు చేసిన పొరపాటు సారధీ...'

సారధి మరేమీ మాట్లాడక తనగదిలోకి దారితీశాడు.

'బట్టలు మార్చుకుని రా ... భోజనం చేద్దువుగాని...'

'నాకు ఆకలిగా లేదు ..'

'నీతో కలిసి తిందామని నేనూ తినలేదు .. నువ్వు తినకపోతే నేనూ పస్తుపడుకోవాలిసి వస్తుంది... మా ఇంటికి వచ్చి, నేను పస్తు పడుకుంటే, పాపం నీకే చుట్టుకుంటుంది..'

'పద వస్తున్నాను...'

సారధి వెళ్ళి భోజనం చేశాడు.

* * *

మరొక రెండు మూడు రోజులు గడచిపోయాయి. పార్వతమ్మ ఆరోగ్యంలో మార్పు లేదు. జ్వరం ఉదయానికి తగ్గి, సాయంత్ర మయ్యేసరికి హెచ్చుతున్నది. దానికి కారణం పగలస్తమానమూ కొడుకు గురించి ఆలో

## జీవనవలయాలు

చించి మనసు పాడుచేసుకోవడమే. చివరకు రామారావుగారు ఓ నిర్ధారణకు వచ్చారు. ఆవిడ జ్వరానికి కారణం మానసికవ్యధ. అంతకుతప్ప శారీరకంగా ఆవిడలో ఏవిధమయిన దోషమూ లేదు. సారధితో అన్నా రాయన :

'మీ అమ్మగారికి జబ్బేమీలేదు... మానసిక వ్యధ ఈ జ్వరానికి కారణమనిపిస్తోంది... ఆవిడమనసుకు శాంతి, శరీరానికి విశ్రాంతి కావాలి... ఆవిడ మానసిక వ్యధకు కారణ మేమిటో కనుక్కోండి...'

పద్మావతి అక్కడే నిలబడి ఉన్నది. రామారావుగారు వెళ్ళిపోయాక, సారధితో

'నేను ముందరేఅనుకొన్నాను తమ్ముడూ.. పిన్ని పగటిపూట ఓక్షణమయినా కన్ను మూయడంలేదు... దీర్ఘంగా ఆలోచిస్తూనే కూర్చుంటున్నది...' అన్నది.

సారధి జవాబు చెప్పలేదు. చాలా సేపు అచేతనంగా కుర్చీలో కూర్చుండిపోయాడు. తల్లికి మానసిక వ్యధ ఎందుకో తనకు తెలుసు. మరి తను అనుభవిస్తున్న మానసిక వ్యధ ? తల్లికోరిక తీర్చాలంటే, ఆవిడ చెప్పిన అమ్మాయి మెళ్ళో మూడు ముళ్ళూ వెయ్యాలి. తను తల్లి మాటను కాదంటే, 'తను తల్లిని ఏడిపించాడు' అంటుంది లోకం.

ఆ రాత్రి సారధికి నిద్రపట్టలేదు.




ఆలోచిస్తూనే పడుకున్నాడు.

ఆ మరునాడు ఉదయం సారధి మాసిన ఇస్తూంటే పార్వతమ్మ అన్నది :

'నాన్నా సారధీ...నా ఆరోగ్యం రోజు రోజుకూ అధ్వాన్నమవుతోంది ... ఏక్షణానికి ఎలా ఉంటానో.. ఓ కోరిక మిగిలిఉంది... అది తీరితే నిశ్చింతగా కళ్ళుమూస్తాను...'

సారధి తల్లివైపు పాలిపోయిన ముఖంతో చూశాడు.

'నేను అనుభవిస్తున్న మానసిక వ్యధ చాలమ్మా... మాటలతో మరింత చిత్రవధ చెయ్యకు...' అన్నాడు.

'ఓ కోరిక మిగిలి ఉందని... అది తీరుస్తానని మాట ఇయ్యరా నాన్నా...'

సారధి గొంతు పెగల్చుకుని, నిస్సహాయంగా,

'చెప్పమ్మా...' అన్నాడు.

'నువ్వొక ఇంటివాడివి కావాలి నాన్నా... కళకళ్ళాడుతూ కోడలు ఇంట్లో తిరగాలి..'

సారధి సమాధాన మియ్యలేదు.

'నీ సుఖసంతోషాలకు అడ్డువస్తున్నానని అనుకుండేవు నాన్నా ... అదిమాత్రం నిజం కాదు... ఇంతకాలమూ నీ కోసం బతికానురా.. అలాంటిది నిన్ను కష్టపెట్టగలనా?... నీ సుఖ సంతోషాలకంటే నాకు కావాలిసిందేమీ లేదు... నీరజ విషయంలో నీ సుఖ సంతోషాలను దృష్టిలో పెట్టుకునే ఎదురు చెప్పాలిసి వచ్చింది... అంతదేశంలో పెళ్ళికాని అమ్మాయిలకు కొదవలేదు... నీరజ తప్ప మరో అమ్మాయిని ఎన్నుకో... పిచ్చి ఉన్న వంశంలో పిల్లమాత్రం వద్దు.. నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తాను. నువ్వు సుఖ పడతావని తోచినప్పుడు అంతస్తులకుకూడా విలువ నివ్వను...'

'ఆ విషయంలో నన్ను క్షమించమ్మా... నీకు ఎదురుచెప్పి నీరజను పెళ్ళిచేసుకోలేను... కాని మరో అమ్మాయిని మాత్రం పెళ్ళిచేసుకోలేనమ్మా... నీరజ ఉట్టి అమాయకురాలు... ఆమెను 'ప్రేమ' అనే ఊబిలోకి దింపి, ఆశలు కల్పించాను... చివరకు వంచించాలిసి వస్తోంది ... ఈ మనసు ఒక యంత్రం కాదు... ఒకరికి ఇచ్చింది వాపసు తీసుకుని మరొకరికి ఇవ్వడానికి ... నువ్వు కోరినట్లు మరో అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే నన్ను నేను వంచించుకోవడమే కాదు; ఆ అమ్మాయినికూడా వంచించి నట్లవుంది... ఒకరి సుఖసంతోషాలతో చెల

గోట మాడటానికి నాకు అధికారం లేదమ్మా...'

'ఇప్పుడేకద ... నా మాట వింటానన్నావు...'

'నేను సుఖపడ్డా, సుఖపడకపోయినా, నేను మరో అమ్మాయిని పెళ్ళిచేసుకోవడం నీకు సంతోషాన్ని కలుగజేసే పక్షంలో అలాగే కానియమ్మా... ఓ అమ్మాయి నీకు కోడలుగా వస్తుంది ... ఆ వచ్చే అమ్మాయి సుఖపడితేనేం? ... పడకపోతేనేం? నాకేం? నువ్వు నాతల్లివి నిన్ను సంతోషపెట్టడమే నా విధి...'

సారథి స్వరంలో చిరాకూ, చికాకూ మిళితమయి ఉన్నాయి. సారథి అక్కడ నుండి లేచి వెళ్ళిపోయాడు. పార్వతమ్మ తేలిగ్గా ఊపిరి తీసుకున్నది. ఆ తర్వాత ఆవిడ చాలాసేపు ఆలోచిస్తూనే ఉన్నది. తను కోరుకునేదల్లా కొడుకు సుఖం. ఇప్పుడు కొడుకు మనసంతా ఆ నీరజపైనే ఉన్నది. వాడి మనసు మరో అమ్మాయి వైపు మళ్ళించాలి. రోజులు గడిచాక నీరజను మరుస్తాడు. హేమ తెలివయినపిల్ల. పైగా చదువుకున్నది. అంతేకాక అందంలో ఆ నీరజ, హేమ కాలిగోటికి కూడా సరితూగదు! వాడిచేత హేమ మెళ్ళో మూడు ముళ్ళూ వేయించడంవరకే తనపని. ఆ తర్వాత వాడి సంగతి హేమ చూసుకుంటుంది! హేమ వాడిని ఓ మార్గంలో పెట్టగలదన్న నమ్మకం తనకు ఉన్నది.

* * *

మరొక రెండుమూడురోజాలకు పార్వతమ్మ జ్వరం తగ్గింది. ఓరోజు ఉదయం రామారావుగారు వచ్చినప్పుడు 'కొడుకు పెళ్ళి త్వరలో చేసేద్దామనుకుంటున్నట్లు' చెప్పింది పార్వతమ్మ.

'మా హేమను చేసుకోకూడదటమ్మా... కట్నం అయిదారు వేలకంటే ఇవ్వలేను కాని, లాంఛనాల విషయంలో లోటు రానివ్వను...'

'నాకు కట్నాలపైనా, కానుకలపైనా మోజు లేదండీ ... అబ్బాయికి అమ్మాయి నచ్చితే అంతేచాలు ..'

ఆ సాయంత్రం రామారావుగారు పతీసమేతంగా వచ్చి, మరునాడు ఉదయం తొమ్మిదీ, పదిగంటల మధ్య బావుందనీ, పిల్లను చూసుకోవడానికి రమ్మనీ పిలిచారు.

'సరే'నన్నది పార్వతమ్మ.

హేమ తను రోజూ చూసే అమ్మాయే, తన మాత్రం ముఖ్యంకాదు. కొడుకు చూడాలి. 'అసలు హేమను సరిగ్గా చూశాడో లేదో?' అనిపించింది. పద్మావతి పెళ్ళి చూపులకు వెళ్ళడానికి ఉత్సాహాన్ని చూపించింది. సారథిమాత్రం 'నీకు నచ్చితే సరేనమ్మా...నీ ఇష్టప్రకారం చేసుకుంటున్న పెళ్లి' అన్నాడు. పార్వతమ్మ 'ససేమిరా' వీల్లేదన్నది.

తెల్లవారింది. హేమసుందరి తల్లి బలవంతంపై తలంటుపోసుకున్నది. కళ్ళకు కాటుక దిద్దుకుని, నుదుట కుంకుమ తీర్చి దిద్దుకున్నది. కాళ్ళకు పారాణి పులుముకున్నది. పదుటుగా జడల్లుకుని, మల్లెల మాల తురుముకున్నది. తల్లి తీసి ఇచ్చిన పట్టు జాకెట్టూ, పట్టుచీర కట్టుకున్నది. తల్లి ఆజ్ఞప్రకారం రెండు చేతులకూ నిండుగా గాజులువేసుకుని, మెడలో కాసుల పేరులేసుకుని, చెవులకు రాళ్ళదుద్దులు పెట్టుకున్నది.

తొమ్మిది కాకుండానే రామారావుగారు గ్లాస్కోపంచె, సిల్కు లాల్చీ వేసుకుని పెళ్లివారికోసం ఎదురుచూడసాగారు. మధ్య మధ్య 'అమ్మాయి ముస్తాబు అయిందా? వాళ్ళు వచ్చేవేళయింది.' అంటూ భార్యను తొందరపెట్టసాగారు. (ఇంకా వుంది)



# వారఫలం

## 12-1-1973 శుక్రవారం మొదలు 18-1-1973 గురువారం వరకు

**మేషం :** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. వృత్తిలో ప్రయాస కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం :** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**సింహం :** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయాణాలు ఫలిస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను సాటివారిలో గౌరవం బాగుంటుంది.

**కన్య :** అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. పుణ్యకార్యాలు చేస్తారు.

**తుల :** మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం :** ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. వృత్తిలో పోటీ వారి పోటీ పెరుగుతుంది. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం ఆఖరులో ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు :** మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలించగలవు. వారం ఆఖరులో భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**మకరం :** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో అనవసరమైన సందేహాలు కలుగుతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కుంభం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలనువింటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మీనం :** మీ ఆలోచనలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

—మహేష్



# సిగలో పువ్వు

సత్యం మందపాటి

'నేను చెబితే నువ్వు వినవు—నీకు తెలీదు. ఎలాగా నీతో' అన్నాడు విసుగ్గా నగేష్.

'ఏం—నీభావాలు నీవి—నాభావాలు నావి—ఎంత పరిస్థితులు ఎంకరేజ్ చేసినా—ధృఢ నిశ్చయం—నీమీద నీకు నమ్మకం వుంటే అటువంటి బలహీనతలు దగ్గరకే రావంటాను—' రెట్టిస్తూ అన్నాడు రామకృష్ణ — విల్స్‌ఫిల్టర్‌కింగ్ సిగరెట్టు పొగ గట్టిగా పీల్చి, పొగ బయటికి వదలి.

నరసింహం యిద్దరివేపూ ఆసక్తిగా చూశాడు.

రంగనాధం మిత్రబృందం వాదోపవాదాలు వింటూనే, ఎదురుగా సముద్రంలో నెమ్మదిగా కదులుతున్న ఓడలను దీక్షగా చూస్తున్నాడు.

'సరే! నేనొకటి చెబుతాను విను—మన ఎదురుగుండా ఏమున్నది.' అడిగాడు నగేష్.

రామకృష్ణ నవ్వాడు. జవాబు చెప్పలేదు.

నరసింహం అన్నాడు 'ఉవ్వెత్తుగా ఎగిరెగిరి పడుతున్న సముద్రం. ఈ విశాఖపట్టణం రోడ్లను కోసివేస్తున్న ఉధృతమైన బంగాళాఖాతం—అందమైన కన్నెపిల్ల యవ్వనంలా బుసలు కొడుతున్న...'

నగేష్ మధ్యలోనే అందుకున్నాడు 'ఏడ్చావులే—నీ పైత్యం కొంచెంసేపు ఆపు—ఆఁ! నరసింహంగాడు అన్నట్టు సముద్రం కన్నెపిల్ల యవ్వనంలా—కాదు—కన్నెపిల్లల యవ్వనం సముద్రంలా బుసలు కొడుతున్నది—అంతే కాదు. వయసు—ఏది—మనవంటివాళ్ల వయసు అన్నది వుందే అది కూడా ఈ విశాఖపట్టణంలోని సముద్రంలా ఉవ్వెత్తుగా ఎగిరెగిరి పడుతున్నది. అప్పుడు మనిషిలోని బలహీనతలు, ఉధృతంగా బంగాళాఖాతంలాగా—మనిషిని అతనిలో వున్న క్యారెక్టర్ని ముంచి వేస్తాయి—అర్థమయిందా—అందుకని...'

ఇసుకలో పడుకుని ఆకాశంవంక చూస్తూ తీరిగ్గా వీరిమాటలు వింటున్న బాబూరావ్ కుతూహలంగా లేచి కూర్చున్నారు.

రామకృష్ణ అన్నాడు. 'నువ్వు చెప్పేది బలహీనుల సంగతి. ఏమాత్రం విల్‌పవర్ వున్నా ఎవడూ లొంగిపోడు, రామకృష్ణ పరమహంస ఏం చేశాడు...'

'ఆయన సంగతి ఎత్తకు— ఆయన వాటికి అతీతుడు కనుకనే గొప్పవాడయాడు—' నగేష్ అందుకున్నాడు.

మళ్ళీ ఏదో అనబోతున్న రామకృష్ణ భుజం మీద చేయివేశాడు బాబూరావ్.

'నేనో కథ చెబుతాను — వింటావా!' అన్నాడు.

'ఏం గురూ! ఇంకెవరూ దొరకలేదా మేం తప్ప—' నవ్వాడు నరసింహం.

'పత్రికలకు రాసుకుంటున్నావ్ చాల్లే—మమ్మల్ని వదిలేయి!' అన్నాడు రంగనాధం.

'మీ రిద్దరూ నోరుమూసుకోండి మరి—నగేష్, రామకృష్ణలు చర్చించే విషయం మీదే ఓ కథ చెబుతాను. అంటే—సెక్స్ గురించే నన్నమాట— చెప్పనా?'

ఒకేసారి అందరూ అన్నారు. 'చెప్పు మరి!' అని.

బాబూరావ్ నవ్వాడు — 'కథ సెక్స్ గురించి — అంతేకాని యిది సెక్స్ కథ కాదు— మీరు వాదనలు కూడా ఆపి సెక్స్ అనగానే యింత ఆసక్తి కనపరుస్తున్నారంటే — నేను చాల సభ్యంగా ఈ కథ చెప్పటం మంచిది—'

'ఉపోద్ఘాతం ఆపి — కథ చెప్పవోయ్ అవతారం'— అన్నాడు నగేష్.

# సిగలో పువ్వు

'అవును— ఈ కథలో హీరో పేరు అవతారం అనే అందాం. అవతారం చాల మంచి కుర్రాడు. బుద్ధిమంతుడు. 'మంచి బాలుడు రాము'కు వుండవలసిన లక్షణాలన్నీ వున్నవాడు. వాళ్ళ వూరి పేరు సంత రావూరో, తక్కెళ్ళపాడో కాని చాల చిన్న పల్లెటూరు. రోజూ చద్దన్నం తిని పక్క వూరికి నడిచి వెళ్ళి చదువుకునేవాడు. ముఖ్యంగా తల్లి చాటు బిడ్డ. అతని తమ్ముడు పుట్టగానే వాళ్ళ నాన్న పోవటం వల్లా, ఇతన్ని చాలా ప్రేమగా, అతి గారాబంగా, అమ్మకూచిలా తయారుచేసింది వాళ్ళమ్మ. పదహారేళ్ళ వయసు వచ్చి, స్కూలు చదువు పూర్తి చేసిన తర్వాతగూడా వాళ్ళమ్మ కొంగు వదిలేవాడు కాదు. మాతృప్రేమలోని రుచులు మరిగిన మనిషి. పల్లెటూరు వదిలి, ఈ విశాఖపట్నంలో కాలేజీలో చేరటానికి బయల్దేరేముందు వాళ్ళమ్మని కావలించుకుని ఏడ్చిన చంటి పిల్లాడువాడు. కాలేజీలో చేరిన మరిరోజుల్లోనే వాళ్ళమ్మమీద బెంగతో జ్వరపడిన కుర్రవాగిన్ను. వాళ్ళమ్మ అనుక్షణం కళ్ళముందు కదలాడుతున్నదని కళ్ళల్లో నీళ్ళు పెట్టుకుని, మిగతా స్నేహితులముందు చులకన అయిపోయిన పిచ్చిసన్నాసి. ఇవి అవతారం లక్షణాలు—'

'నీ కథ అంతా అవతారం అవతార విశేషాలేనా ...అసలు విషయం ఏమన్నా చెబుతావా !' రామకృష్ణ అన్నాడు.

'సెక్సుకథ-స్ట్రిప్‌టీజ్ లాంటిది—ఒక్కసారి అంతా చెప్పేస్తే మజా ఉండదు. మెల్లమెల్లగా, అంచలంచలుగా...' నగేష్ అన్నాడు.

'కాని నువ్వు ఒక్కసారిగా — వెంటనే నోరు మూసుకుంటే—మేం కథ వింటాం—' నరసింహం మందలించాడు.

రంగనాథం నవ్వాడు

'సైలెన్స్ ప్లీజ్—ఆఁ! ఎందాకా వచ్చాం—అవతారం హాస్టల్లో రూమ్ దొరకక—పోల్జర్ పేటలో ఒకరూమ్ తీసుకున్నాడు. అంటే అతని సీనియర్ భద్రం తీసుకున్న రూమ్‌లో రెండో మనిషిగా చేరాడు. భద్రం అన్ని పెద్ద సిటీలు తిరిగినమనిషి. బొంబాయిలో చర్చి గేటు స్టేషన్‌నుంచి దాదర్‌వరకు ఏమేం స్టేషన్లు వున్నవో, మద్రాస్‌లో మౌంట్ రోడ్డు పొడుగు ఎంతో, కలకత్తాలో కాళికా దేవాలయంకన్నా కేబరేలకే జనం ఎందుకు ఎక్కువగా వెడతారో, మొదలైన ప్రపంచ జ్ఞానం తెలిసినవాడు.

'అవతారం తన చదువేదో తను చూసుకునేవాడు. క్లాసు పరీక్షల్లో ఫస్టు మార్కులు తెచ్చుకునేవాడు బుద్ధిమంతుడైన విద్యార్థి అనిపించుకున్నాడు. కాని భద్రం—అవతారాన్ని చూసి 'వట్టి మొద్దబ్బాయిగాడు' అనేవాడు.

అవతారం కూడా భద్రం దగ్గరవున్న పుస్తకాలు, వాటిలోని బొమ్మలు చూసి సిగ్గుపడేవాడు. భుజంమీదవున్న తువ్వాలును నిండుగా కప్పుకొనేవాడు. భద్రం నవ్వి అలా ఫోటోలు తీసేవాళ్ళకీ, తీయించుకున్న వాళ్ళకీ లేని సిగ్గు నీకేమిటోయ్ అవధానీ—యిది చదివిచూడు అని యింకో పుస్తకం అందించాడు— అవతారం ఆ పుస్తకం అందుకో లేదు. కాని భద్రమే చదివి విని పించాడు, అవతారానికి కంపరమెత్తింది. 'ఈ పుస్తకాలు బజార్లోనే అమ్ముతారా!' అని అడిగాడు.

'అవును! పబ్లిక్ బజార్లో— షాపుల్లో— అందరికీ కనబడేటట్లు వేలాడదీసి మరీ అమ్ముతారు' అన్నాడు భద్రం.

'మరి జనం ఎట్లా వూరుకుంటున్నారు— ఈ చెత్తను వూడిచి అవతల పారెయ్యకూడదూ!' నిజంగా ఆశ్చర్యపోయాడు అవతారం.

నవ్వాడు భద్రం 'జనం వూడిచి అవతల పారేసేంత పని చేయరు. వాళ్ళకి అవి కావాలి— అందుకే అటువంటి పుస్తకాలు ప్రచురిస్తారు!'

'మరి ప్రభుత్వం ఏం చేస్తున్నట్లు? ఈ సభ్య ప్రపంచంలో ఆడా—మగా, పిల్లా—పీచూ తిరిగేచోట— ఈ పుస్తకాల్ని అమ్ముతున్నందుకూ, అసహ్యమైన చెత్తంతా రాసి, నిర్మల వాతావరణాన్ని కలుషితం చేస్తున్నందుకూ, అటువంటి పుస్తకాలను ఎందుకు నిషేధించదూ?' అవతారం కొంచెం ఆవేశంగా అన్నాడు

'ప్రభుత్వానికి అదేపనా—ఇంతకన్నా పెద్ద పెద్ద విషయాలే తేలటంలేదు. ఇదో లెఖ్ఖా? నీకింకా ఏం తెలీదు అవతారం— నువ్వు పల్లెటూరి మొద్దువి. నాతో రా— నీకు అన్నీ చూపిస్తాను — ప్రభుత్వం యింకా ఏవేవి నిషేధించాలో, అసహ్యమైన చెత్త అన్నావే—దాంట్లో ఆనందం పొందేవాళ్ళు ఎంతమందో అన్నీ చూపిస్తాను!' అన్నాడు భద్రం.

'ఛీ! నాతో అటువంటివి చెప్పకు— నాకు అసహ్యం వేస్తుంది' అన్నాడు అవతారం.

కాని అతనిలో ఏదో కుతూహలం కలి(



గింది. ఆడవాళ్ళు సిగ్గు లేకుండా అలా ఫోటోలు తీయించుకోటానికి ఎలా యిష్టపడతారు అని సందేహమే కాకుండా ఆశ్చర్యం కూడా కలిగింది. రోడ్డుమీద శరీరం కనపడేటట్లు ఆడవాళ్ళ 'వేషం' వేసుకుని వెడుతుంటే నే. మొదట్లో బిత్తరపోయేవాడు. నిండా దుస్తులు కప్పుకున్న వాళ్ళమ్మ గుర్తుకు వచ్చేది. అమ్మ గుర్తుకు రాగనే మనస్సంతా హాయిగా, నిర్మలంగా వుండేది కాని యింతలో వీపు అంతా కనపడే జాకెట్టు వేసుకుని స్కూటర్ మీద మగాడ్ని కావలించుకుని వెడుతున్న అమ్మాయిని చూడగానే— మనసులో అదోలా అనిపించేది. ఎలా అందరికి శరీరం చూపించటంలో వాళ్ళవుద్దేశ్య మేమిటి? వాళ్ళకి సిగ్గు వుండదా? అనుకునేవాడు.' బాబూరావ్ మాటలకు అడ్డొస్తూ అన్నాడు నరసింహం.

'యిందాక నువ్వన్నావే—నిజంగా పిచ్చి నన్యాసే మీ అవతారం—లేకపోతే—అటువంటి ఫోటోలు, స్కూటర్ మీద ఆడపిల్లల్ని చూస్తే అలాటి పలిముడిముద్ద భావాలు రావటమేమిటి?'

'వాడిని చెప్పనీరా—మధ్యలో నువ్వేమిటి? బార్ ముందర ఎదురుపడే మా ·బాబాయి లాగా!' రామకృష్ణ విసుక్కున్నాడు.

రంగనాథం వేయుశనగపప్పు పొట్లాలు కొని అందరికీ తలా ఒకటి యిచ్చాడు.

బాబూరావ్ కథ చెప్పటం సాగించాడు.

'అవతారం ఎప్పుడూ సతీ అనసూయ, హనుమాన్ పాతాళ విజయం లాంటి సినిమాలే చూసేవాడు. భక్తప్రహ్లాదకి వెడదామని బయల్దేరిన సందర్భంలో— భద్రం, అవతారాన్ని నానాచివాట్లూ పెట్టాడు. దానిబదులు శివలీలలు సినిమా చూడమన్నాడు. బొందితో కైలాసానికి వెళ్ళటానికి నలభై పైసలు పెట్టి ఆ సినిమా చూడమన్నాడు. అంతేకాదు నీ అంత చవలాయే ఈ భూప్రపంచంలో ఉండడన్నాడు. భూప్రపంచం అంటూనే గుర్తుకు వచ్చింది కాబోలు - భూలోక అందగత్తెలు అనే యింగ్లీషు సినిమా వచ్చింది రమ్మని లాక్కెళ్ళాడు.

'నాకు యింగ్లీషు సినిమాలు అర్థం కావు' అన్నాడు అవతారం.

'అర్థం అవటానికేం ఉండదు దాంట్లో

—అంతా చూసి తరించ వలసినవే!' అన్నాడు భద్రం.

సినిమాలో దేశదేశాల అమ్మాయిలూ బట్టలు విప్పుకుని 'డాన్స్' చేస్తుంటే—'ఛీ' అనుకున్నాడు కానీ మనసులో ఒక విధమైన చలనం కలిగింది. ఒకసారి అనుకోకుండా విజిల్‌కూడా వేశాడు. భద్రం వింతగా చూశాడు అవతారాన్ని. అంతేకాదు అవతారాన్ని దాదాపు అటువంటిదే యింకొక తెలుగు సినిమాకు కూడా రెండవ ఆటకు తీసుకు వెళ్ళాడు.

ఆరోజు రాత్రి అడిగాడు అవతారం భద్రాన్ని.

'ఎందుకు అలా డాన్స్ చేస్తారు వాళ్ళు!' అని—

భద్రం చెప్పాడు. 'మనలాటివాళ్ళని ఆనందపరచటానికి!'

'ఏమిటా ఆనందం!' పైకి అన్నాడు కాని, యిందాక సినిమాలో ఏదో ఆనందం తనకూ కలిగినట్టే ఫీలయాడు.

'మరి వాళ్ళకు సిగ్గు వుండదూ!' అమాయకంగా అడిగాడు.

'సిగ్గెందుకు —డబ్బులిస్తారుగా వాళ్ళకి అలా చేసినందుకు!'

'డబ్బు కోసమని అలా చేస్తారా?'

'ఏమున్నదీ అందులో — కాసేపు అలా చేయుటమేగా!' భద్రం చెప్పింది. ఎందుకో నచ్చలేదు అవతారానికి.

అదే అన్నాడు.

భద్రం అన్నాడు 'సినిమాలో చేయటానికి ఏముందిరా నాగన్నా—ఎవరో నలుగురైదుగురు వుంటారేమో అక్కడ. అసలు పారిస్, న్యూయార్క్, టోక్యో—అంతెందుకోయ్, బెంగుళూరు, బొంబాయి, కలకత్తాలలో లేవూ కాబరేలూ, స్ట్రిప్ టీజ్‌లూ...'

అర్థం కానట్టు చూశాడు అవతారం.

'కాబరే అంటే ఒకవిధమైన డాన్స్ — ఆ డాన్స్ చేస్తూనే స్ట్రిప్ చేస్తారు. అంటే శరీరం మీద వున్న ఒక్కొక్క వస్త్రాన్నీ వదిలేస్తారు. దాన్నే స్ట్రిప్ టీజ్ అంటారు. ఈ డాన్స్‌లు నేను చాల చూశాను. ఎంత బాగుంటాయో తెలుసా—ఈ డాన్స్ చివరలో ...' అంటూ చాలా చాలా చెప్పాడు భద్రం.

అవతారం కుతూహలంగా అన్నీ విన్నాడు. 'నిజమేనా!' అన్నాడు చివరికి,

# సిగలో పువ్వు

'భలేవాడివే — ఎప్పుడయినా సిటీలకి వెడితే చూడు—నీకే తెలుస్తుంది!'—

'మరి యిటువంటి డాన్స్‌ల్ని ప్రభుత్వం ఎందుకు నిషేధించటం లేదు — పబ్లిక్ న్యూసెన్స్ కదా — పిల్లలూ, పెద్దలూ అందరూ చెడిపోతారుకదూ యిటువంటివి చూసి...'

'ఒరే బుల్లెబ్బాయి—నీకిందాకే చెప్పాను కదా దానికి జవాబు — అసలు చెడిపోవటం అంటే ఏమిటి?' సూటిగా అడిగాడు భద్రం.

అవతారం మాట్లాడలేదు. అతనికేమీ అర్థం కాలేదు కూడా — కారణం అతని వయసేనేమో.

'చెడూలేదు — మంచీలేదూ —మనిషికి కావలసింది సుఖం. అంతే!' అన్నాడు భద్రం.

అవతారం ఆ రాత్రి అంతా ఆలోచనలతోనే గడిపాడు. కాసేపు అతనికి సినిమాలోని సీన్లు గుర్తుకు వచ్చాయి, కాసేపు—ప్రజలూ — ప్రభుత్వం యిటువంటి వాటిని ఎందుకు నిరోధించటం లేదు అని అనుకున్నాడు. కారణాలు మాత్రం అంతు బట్టలేదు. భారతదేశ చరిత్ర సంస్కృతి తెలిసినవాడు కనుక, భారత స్త్రీ పవిత్రతను అర్థం చేసుకున్నవాడు కనుక యిలా విదేశ స్త్రీలతోపాటు మన దేశంలోని స్త్రీలు కూడా—డబ్బు కోసం కేవలం డబ్బుకోసం—మానాభిమానాలు విడిచి, దేశ సంస్కృతిని మరచి — భారతస్త్రీ ఔన్నత్యాన్ని మరచి యిలా ఎందుకు ప్రవర్తిస్తున్నారా అని కలవరపడ్డాడు. తమ భార్యలు, చెల్లెళ్ళు లాటి—సాటిస్త్రీలను, మాతృత్వానికి చిహ్నమైన స్త్రీలను—యిలాటి వాటికి ప్రోత్సహించి — అందులో ఏదో వెర్రి ఆనందం అనుభవించే ఈ పురుష పుంగవులను ఏమనాలి? తనలో తనే చాల బాధపడ్డాడు. కాని ఆ డాన్సులే, ఆ అవయవ ప్రదర్శనే అతని కళ్ళముందు కదలాడి—అదోవిధమైన పులకరింతను కలుగజేశాయి. నిద్రపోతున్న భద్రం దిండు క్రింద వున్న పుస్తకాన్ని తీసుకుని, అవతారం బొమ్మలు చూస్తూ కూర్చున్నాడు.

మరునాడు ప్రొద్దున భద్రం యింకో కొత్త విషయం చెప్పాడు అవతారానికి.

'ఆడవాళ్ళంటే ఏమిటనుకున్నావ్. సిగలో పువ్వులాటి వాళ్ళు—పువ్వు కళకళలాడుతున్నప్పుడు, నవనవలాడుతున్నప్పుడు జడలో పెట్టుకుంటారు. పువ్వు వాడిపోగానే విసిరి అవతల పారేస్తారు. ఆడవాళ్ళనికూడా అలాగే చేయాలని ఒక పుస్తకంలో చదివాను' యిట్లాగా చాలచాలా చెబుతుంటే చాల ఆసక్తిగా విన్నాడు అవతారం. ఒక ప్రక్క ఆశ్చర్యం, ఒకప్రక్క ఆసక్తి, ఒకప్రక్క అదోవిధమైన మధుర భావన. ఒకప్రక్క చెప్పలేని పులకింత—అతనిలో ముందు కలిగిన అసహ్యాన్ని, ఆవేశాన్ని, బాధని ప్రక్కకి నెట్టివేశాయి.

ఆరోజు భద్రానికికూడా చెప్పకుండా మళ్లీ అదే సినిమాకు వెళ్లాడు అవతారం.

ఒక్కొక్క దేశంలోని అందగత్తెలూ, తెరమీద నగ్ననృత్యాలు చేస్తుంటే అవతారం హృదయం అదోవిధమైన ఆనందంతో పులకించింది. శరీరం వేడెక్కింది తన భుజం దగ్గర ఏదో మెత్తగా తగిలింది. మెల్లగా ప్రక్కకుచూసి వులిక్కిపడ్డాడు. అదోవిధమైన వణుకు వచ్చింది. తనచేయి ఆమె చేతిలోనుంచి విడిపించుకుందామనుకున్నాడు, కాని, ఆపని చేయలేదు.

ఆమె ఏదో అడిగింది.

'ఊఁ' అన్నాడు మత్తుగా.

సినిమా యింకా పూర్తవలేదు.

ఆమె లేచింది. అవతారం కూడా ఆమెతో లేచాడు, ఆమెతో నడిచాడు. ఆమెతో పాటే ఆ యింట్లో అడుగు పెట్టాడు, ఆమె చూపించిన గదిలోకే

## చింతపండు పచ్చడి

| కావలసిన వస్తువులు | కొలతలు(పదిమందికి) |
|---|---|
| చింతపండు | ... 50 గ్రాములు |
| బెల్లం | ... కొద్దిగా |
| పచ్చిమిరపకాయలు | ... 2 |
| మిరపపొడి | ... చిటికెడు. |
| ఉప్పు | ... 5 గ్రాములు |

పద్ధతి :—

చింతపండు నానబెట్టి పులుసు పిండుకోవాలి. అందులో అన్నివేసి ఉడికించి, వాడుకోవాలి.

—దూ. రా.

దారి తీశాడు. ఆమె తలుపులు వేసిన తర్వాత కాని ఆమెని పరీక్షగా చూడలేదు. అప్పుడయినా చూశాడు గానీ అదోవిధమైన వణుకుతో చూశాడు. వేడెక్కిన కళ్ళతో చూశాడు ఆమె ఏదో అడిగింది. జేబు లోంచి నోట్లు తీసి లెక్కపెట్టి చేతికి అందించాడు. ఆమె నోట్లు అందుకుంది. అతను ఆమె చేతిని అందుకున్నాడు. ఆమె నోట్లను దగ్గరకు తీసుకుంది. అతను ఆమెను దగ్గరకు తీసుకోబోయాడు.

ఇంతలో తలుపు దబదబా చప్పుడయింది—

అవతారం ఆమెను వదిలేశాడు, గాబరాగా ఆమె తలుపు తీసింది—బయట ఉన్న ఆమె ఏడుస్తున్న పసిపిల్లవాడిని ఆమెకు అందించి 'సాయంత్రం నుంచి ఊరికే ఏడుస్తున్నాడు. ఆడించినా ఏడుపు ఆపడు, కొట్టినా ఆపడు, వెధవ పీనుగ! ఆకలి గావును. ఒక్కసారిగా పీక నొక్కితే సరి—గుటుక్కున చస్తాడు — శనీ విరగడవుతుంది!' అన్నది. అంటూనే — రుసారుసా వెళ్ళిపోయింది.

ఆమె పిల్లవాడివేపు జాలిగా చూసింది. బాధగా చూసింది. వికలమైన మనస్సుతో నిర్లిప్తంగా చూసింది. వాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు — ఆమె మళ్ళీ మళ్ళీ చూసింది. వాడు యింకా ఏడుస్తునే వున్నాడు.

అవతారం ఆమె కళ్ళల్లో తిరుగుతున్న నీటిని చూశాడు. ఆమె ఆ కన్నీళ్ళు అతని కంట పడకూడదనుకున్నది. కానీ — కన్నీళ్ళకి బొత్తిగా సమయా సమయాలు తెలియవు కాబోలు — ఆమె బుగ్గల మీదుగా ఏకధారగా వర్షించి—పసిపిల్లవాడి తలమీద పడ్డాయి

అవతారం చలించాడు. ఏదో బాధ అనిపించింది.

ఆమె చటుక్కున కన్నీళ్ళు తుడుచుకుంది. 'అరె! ఈ కన్నీళ్ళు యివాళ బయటకు ఎలా వచ్చాయి!' అన్నది ఆశ్చర్యత్నంగా.

అవతారానికి ఆమె హృదయం ఒక అందని అగాధమంత అనిపించింది.

పసిపిల్లవాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. ఆమె చటుక్కున, అవతారం ఎదురుగానే జాకెట్టు ముడి విప్పింది. కుర్ర వాడికి పాలివ్వ సాగింది.

అవతారం అటే దీక్షగా చూశాడు. కళ్ళు విప్పి మరీ మరీ చూశాడు. కానీ అతనికి సినిమాలో డాన్సులూ, బట్టలు విప్పుకున్న డాన్సర్లూ గుర్తుకు రాలేదు. భద్రం పుస్తకాల్లోని ఆ బొమ్మలూ గుర్తుకు రాలేదు. అసలటువంటి తలపులేవీ రాలేదు.

కానీ వాళ్ళమ్మ గుర్తుకు వచ్చింది. తన తమ్ముడికి పాలిచ్చి, లాలించిన వాళ్ళమ్మ గుర్తుకు వచ్చింది. తన బాల్యం గుర్తుకు వచ్చింది.

ఆమె ముఖంలోకి సూటిగా చూశాడు ఆమె పిల్లవాడి తల నిమురుతూ— ఆ పసి ముఖంలోకే దీక్షగా చూస్తున్నది. పసివాడు ఆత్రంగా, ఆకలిగా పాలు త్రాగుతున్నాడు.

అవతారం కళ్ళల్లో ఎందుకో నీళ్ళు నిలిచినయి. అలాగే నుంచున్నాడు.

ఇందాకటి ఆమె వచ్చి 'యిక వాళ్ళ వాడినిలా యివ్వు' — అని కసురుకుంటూ పాలు త్రాగే పిల్లవాడిని, బలవంతంగా లాక్కుపోయింది.

ఆమె అవతారం వేపు చూసింది—

అవతారం ఏమీ మాట్లాడలేదు—

ఆమె జాకెట్ ముడి కూడా వేసుకోలేదు—'రండి'! అన్నది—

అవతారం ఒకసారి ఆమెవేపు సూటిగా చూశాడు. చటుక్కున వెనుదిరిగాడు. పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ, ప్రతిమలా నిలబడిన ఆమెను వదలి, వెళ్ళిపోయాడు'. కథ ముగించాడు బాబూరావ్.

నరసింహం, నాగేష్ మాట్లాడలేదు.

రామకృష్ణ సిగరెట్ వెలిగించి 'తర్వాత!' అన్నాడు.

రంగనాథం జవాబు చెప్పాడు. 'తర్వాత— ఆడవాళ్ళు సిగలో పువ్వులు ఏనాటికీ కాదనీ, ఉదాత్తమైన నడవడీ, ఉన్నతమైన వ్యక్తిత్వంతో నవనవ లాడే పువ్వులలాటివనీ, అవి అంత చక్కగా పువ్వుప్పుడు మాసవుడికి సిగలో అలంకారం లాంటివనీ, కానీ — ఏనాడు ఆ నడవడీ, వ్యక్తిత్వం వాడిపోయి, కుళ్ళి పోవటానికి సిద్ధమవుతాయో— ఆనాడు ఆ కుళ్ళును తీసి అవతల పారవేయాలనీ తెలుసుకున్నాను! — ఆనాటి నుంచీ నిజమైన మానవునిలా బ్రతుకుతున్నాను!' ●



# పిల్లల పెంపకం-తల్లుల బాధ్యత

చిన్నపిల్లల మనస్తత్వాన్ని (ఛైల్డ్ సైకాలజీ) అర్థం చేసుకోవడం చాలా కష్టం. అందరు పిల్లలూ ఒకేలాగ వుండరు. కొందరికి పుట్టుకతోనే అతి తెలివితేటలు వుంటాయి. కొందరి బుద్ధి కుశలత మరీ తక్కువగా వుంటుంది. వారివారి ఐ. క్యూ. (బుద్ధి కుశలత)ని బట్టి వారికి సరియైన ట్రైనింగు నివ్వాలి. కొంతమంది పిల్లలకి అతిగా పొగుడుతూ, ప్రోత్సాహ మివ్వవలసి వస్తుంది. ఆ రకమైన పిల్లలను భయ పెట్టడం, కొట్టడం చేస్తే వాళ్ళు మొండి కెత్తేస్తారు. మరొకరకం పిల్లలు భయ పెడితే ఎంతటి పనైనా నిముషాల్లో చేసే స్తారు. ఈ విధంగా పిల్లల మనస్తత్వాన్ని అర్థం చేసుకుని ప్రవర్తించాలి.

బాల్యంలో పిల్లల మనస్సు స్వచ్ఛమైన తెల్లని కాగితంలా వుంటుంది. ఆ పసి హృదయం మీద తల్లిదండ్రులు ఏవిధంగా వ్రాస్తారో ఆవిధంగానే పిల్లల ప్రవర్తన ఆధారపడి వుంటుంది. ప్రతి ఒక్కరికి మొదటి గురువు తల్లి, మొదటి పాఠశాల ఇల్లు అని అందరికీ తెలుసున్న విషయమే. ఆ వయస్సులోనే తల్లిదండ్రుల్ని చూసి పిల్లలు ఎన్నో విషయాలు నేర్చు కుంటారు. అందువల్ల, పిల్లలతో ఎలా ప్రవర్తించాలో, వారిని సక్రమమైన మార్గంలో ఎలా పెట్టాలో, ఆలోచించి చేసే బాధ్యత తల్లిదండ్రులది. సాధారణంగా చూస్తూ వుంటాం. చిన్నపిల్లలపై పెద్ద వాళ్ళు ఎంతో అధికారం చూపిస్తూ వుంటారు. అతిగా తిట్టడం కొట్టడం, కోపంగా చూస్తూ అసహ్యించుకోవడం చేస్తారు. ఆ వయస్సులో పిల్లలు నిస్స హాయులు, పెద్దవారిని ఎదిరించే శక్తి వారికి వుండదు. మనం కొట్టినా, తిట్టినా మనపైనే ఆధారపడి వుంటారు. వయస్సులో పెద్దవాళ్ళం కదా అని అనవసరమైన అహంకారం పిల్లలపై చూపించకూడదు. దానివల్ల పిల్లల కోమలమైన మనస్సు విరిగి పోతుంది. వారిలో 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్' పెరిగి, ఆత్మాభిమానం దెబ్బ తింటుంది. అంతే కాదు పెద్దవుతున్నకొద్దీ వారిలో ప్రతీకార వాంఛ పెరిగి, తల్లి దండ్రులపై ప్రేమ తగ్గిపోతుంది.

ప్రతి తల్లికీ తమ బిడ్డలపై ఎన్నో ఆశలు వుంటాయి. వారి జీవితంలో సఫలము కాని కోరికల్ని, ఆశయాల్ని పిల్లల ద్వారా తీర్చుకోవాలని ఆశపడుతారు. ఒక తల్లికి భరతనాట్యం ఇష్టమనుకోండి. కారణాంతరాలవల్ల ఆమె కోరిక నెరవేరక పోవచ్చును. అలాంటప్పుడు ఆమె తన కూతురుకైనా ఆ భరతనాట్యం నేర్పించాలని అనుకోవడం సహజం. కాని ఒక్కొక్కప్పుడు పిల్లల అభిరుచులకూ, తల్లుల అభిరుచులకూ ఎంతో తేడా వుంటుంది. తల్లికి నచ్చిన పని పిల్లలకు నచ్చక పోవచ్చును. తల్లికి భరతనాట్యం ఇష్టమయితే పిల్లకు పెద్ద పెద్ద చదువులు చదవాలనే కోరిక వుండవచ్చును అలాంటప్పుడు వారిని నిర్బంధించి తాము చెప్పినదే చెయ్యాలి అని పట్టు పట్టకూడదు. వారికి అభిరుచి లేని పనులలో వారు రాణించలేక పోవచ్చును. పిల్లల అభిరుచులేమిటో వారి కేపబులిటీ ఎంతో తెలుసుకుని, దానికి తగిన శిక్షణ నివ్వాలి. తల్లిదండ్రులు ముఖ్యంగా తెలుసుకోతగిన దేమిటంటే, పెద్దవారిలోలాగే పిల్లలలోనూ అనేకమైన మూలప్రవృత్తులు, అభిరుచులు వుంటాయి. అందుచేత వారిలో దాగివున్న టాలెంట్స్‌ను వికసింపచెయ్యడానికి ప్రయత్నించాలి. దానికి తగినంత ప్రోత్సాహము తల్లిదండ్రులనించి పిల్లలకు లభించాలి. అలాగని పిల్లల్ని ఎన్నడూ మన ఎక్స్‌పెరిమెంటల్ ప్రోజెక్టుగా వాడుకోరాదు. చాలమంది తల్లులు తమలోని ఆంబిషన్సు, అన్నీ పిల్లలపై ఎక్స్‌పెరిమెంటు చెయ్యాలని ప్రయత్నం చేస్తారు. దానివల్ల కొంతమంది పిల్లలు ఎటూ ఎడ్జస్టు కాలేకపోతారు. అలాగే మా ఇంటిపక్కనే ఒక ఫామిలీ వుంది. వాళ్ళ పాప చాలా తెలివైనది, అందమైనదీను. ఎప్పుడూ క్లాసులో ఫస్టు స్కూల్లో ఏ ఫంక్షన్ జరిగినా ఎక్కువ ప్రైజులు ఆమెకే వచ్చేవి. దాంతో తల్లిదండ్రులు కొండెక్కి పోయారు. ఆమెకున్న తెలివి తేటలకు, ఆమె చదువుతున్న క్లాసు తగదని, వయస్సుతో నిమిత్తం లేకుండా, వాళ్ళనీ వీళ్ళనీ పట్టుకుని చివరికి డబల్ ప్రమోషన్ ఇప్పించేసి జంప్ చేయించేశారు. ఇంక ఇంటిదగ్గర డాన్సుకి మాస్టరు. ఆ పిల్లకి డాన్సులు, సంగీతంలాంటి వాటిలో సరదా లేదు. నేర్చుకోనంటే తల్లిదండ్రుల భయం. ఆ సంవత్సరం ఆ అమ్మాయి ఎటూ కాకుండా అయిపోయింది. ఎక్కువ శ్రమపడడం వల్ల శారీరకంగానూ, మానసికంగానూ కూడా వెనకపడి పోయింది. వయస్సుకిమించిన పనులు చెయ్యమని పిల్లలని నిర్బంధించడంవల్ల చాలా నష్టాలు వుంటాయి.




పిల్లల్ని ఎప్పుడూ ప్రోత్సాహమిస్తూ ప్రేమగా పెంచాలి అవమానం తిట్టడం, కొట్టడం, విసుక్కోవడం చెయ్యకూడదు. మరొక ముఖ్యవిషయ మేమిటంటే, సహజంగా పిల్లల్లో తప్పువున్నా సరే పైవారి ఎదురుగా కాని, తోటిపిల్లల ఎదురుగా కాని కొట్టడం

(41వ పేజీ చూడండి)

గంగమ్మ కుండలు సర్దుతూ విసుక్కొంటూంది. వెంకటయ్య గుడిశె ముందు అడుగు జారినటు చతికిలబడి వున్నాడు. వెంకటయ్యకు కోపంగా వుంది, అయినా దిగమింగుకు వూరుకొంటున్నాడు.

పిచ్చిగాడు — గంగమ్మ వెంకటయ్య పిల్లల్లో ఒకడు—వాడెన్నోవాడో! మిగతా వాళ్లంతా ఎక్కడ చచ్చారో అజావజా లేదు. కుండలో కూడుంటే అంతా అక్కడే పడి చచ్చేవాళ్లు. ఇప్పుడొక్కడూ లేదు.

ఉన్నట్టుండి పిచ్చిగాడు వెర్రెత్తినట్టు ముందున్న మట్టి బొచ్చెని ఎత్తి నేలకేసి కొట్టాడు. గంగమ్మ వెనక్కి తిరిగిచూచి.

'నీకేం వొచ్చిందిరా మాయరోగం బొచ్చె పగలేశావ్?' అని వెన్నుకొరికి వొక్కటి చరిచింది. దాంతో వాడు ఇన్సూరెన్స్ కట్టని యింపాలా కారుకి ఏక్సిడెంట్ అయినట్టు ఏడవటం మొదలుపెట్టాడు.

వెంకటయ్యకు చిర్రెత్తింది. పిచ్చిగాణ్ణి రెండిచ్చుకొన్నాడు. గంగమ్మను నాలుగు తిట్టాడు. తుపుక్కున వుమ్మేసి యింటిని తిట్టుకొంటూ లేచిపోయాడు.

పోవటం పోవటం కోమటిశెట్టి యింటికి పోయాడు, అరసోలెడు గింజలు అప్పె అడుగుదామని. వెంకటయ్య నోరు తెరవక ముందే శెట్టి ఎవరివీాదో కాట్లకుక్కలా అరుస్తున్నాడు.

'ఈ కూలి నాయాళ్లకి అప్పిచ్చేకంటే కుక్కలకేయటం నయం...సిగదరగ పట్టి కెళ్లి తింటమేగాని తెచ్చియిచ్చే నాయాలు ఒక్కడూ కనపడ్డయ్యే—' ఆ మాటలు విని వెంకటయ్య గిరుక్కున తిరిగిపోతుంటే...

కూలి జనం గుంపులు గుంపులుగా ఎగడిపోతున్నారు — మళ్లించే మనిషిలేని మందలాగ!

అందరి మొహాలు కాలిన పెనాల్లా వున్నాయి. వాళ్ల కడుపులో అగ్ని కణకణా రగులుతోంది. వెంకటయ్యకూడా ఎవర్నీ అడక్కుండానే వాళ్లవెంట పడ్డాడు. ఎక్కడికో అతనికే తెలీదు. అతను ఎవర్నీ అడగాలేదు. అసలా వెళ్లే వాళ్లల్లో ఎవరికైనా తెలుసో తెలీదో! ..అయినా ముందుకు పడదోసుకు పోతున్నారు.

* * *

ఎనిమిది గంటలైంది.

ఎండ మండిపోతోంది.



అయినా గుమాస్తా గుర్నాథం యింకా నంగం చిరిగి దించుకుపోయిన కడుపులాగా మధ్యభాగంలో పెద్ద గొయ్యిపడ్డ మడత మంచంలో పడుకొనే వున్నాడు. నిద్రపోవటం లేదు. కాని లేవడు...ఎందుకు లేవడంటే... లేవగానే అతనిక్కావలసిన 'కాఫీ' లేదని అతని అనుమానం.

వంటింట్లో గిన్నెలు పగుల్తున్నాయి—

వాటితోపాటు చంటాడి వీపుకూడా పగుల్తోంది.

ఆ గందరగోళం గుర్నాధానికి చైనీస్ టార్చర్‌లా తయారైంది. ఇహ పడుకోలేక పోయాడు...లేచాడు...టూత్ పేస్ట్ అయిపోయింది. డొక్కలంటుకుపోయాయి దానికి. ఎంత కుస్తీపట్టినా గొప్పవాళ్ల యిన్‌కంటాక్స్ యరియర్స్‌లాగా ఒక్క పిసరకూడా రాలా. ప్రయోజనం లేక దాన్ని ఒక రాయి మీద పెట్టి మరో రాయితో కొట్టాడు. ఆ దెబ్బతో దాంట్లోంచి కొంత బయటి కొచ్చినమాట నిజమేగాని అందులో సగం అతని మొహాన పడింది!

పసివాడు పాలకి సత్యాగ్రహం చేసి ప్రయోజనం లేక అరాచకానికి దిగాడు. కనపడ్డవన్నీ నేలకేసి కొడుతున్నాడు. వాడి ఆగం వుక్కుఫ్యాక్టరీ ఆందోళనంగా తయారైంది. గుర్నాథం మొహం తుడుచుకొచ్చి

'ఇంకా కాఫీ పెట్టలేదా?...'

'ఏం పెట్టి?'—అని పెన్సిన్ బంతిని నేలకేసి కొట్టినట్టు సమాధానం వచ్చింది.

'ఇవ్వాల్టికి పక్కయింట్లో అప్పు తేకూడదా?'

'మూడ్రోజులబట్టీ అదే చేసా...యివ్వాళ వాళ్లకే లేదట' గుర్నాధానికి వొళ్లుమండింది; అతని దగ్గర గనక ఆటంబాంబు వుంటే వేసి ఇల్లు, ఇల్లాలు, పిల్లల్నీకూడా—పేల్చేద్దామనుకొన్నాడు. పాలవాడు బాకీ అడగటానికి వచ్చాడు. ఇహ వరసే... కూరలవాడు, బియ్యంవాడు, చాకలాడు, పనిమనిషి......పో......పో.....పారిపో...అని సినిమాలో అంతరాత్మలా అతని కాన్షన్ ప్రబోధించింది.

గుండీలు పెట్టుకొనే బాధలేని ప్యాంటు వేసుకొంటూ సైకిల్ పెడల్‌మీద కాలు పెట్టి తోసుకొంటూ వెళిపోయాడు.

* * *

సూపర్‌వైజర్ ప్రకాశం 'కాస్త టిఫిన్‌చేసి

# కీలకం

తగులబెట్టకూడదా?'—అని చిరాకు పడ్డాడు తనలో సగంమీద. ఆ సగం మరో సగం మీద 'రేపటినుంచీ యీ కాఫీనీళ్లకూడా వుండవు' అని తిరగబడింది.

గొటగొటా కాఫీ త్రాగి బయటికి పోబోతుంటే—పెద్దాడు 'ఫెరావో' పట్టుకొని చేసి జామెట్రీబాక్స్ కొనటానికి డబ్బులికి నిలవేశాడు. వాడిమీద లంబకోణంలో లేచాడు ప్రకాశం. ప్రకాశం కొడుకు తెలివి కలవాడు.

'మీరు నామీదెగురుతారు. మాస్టరు బెంచెక్కిస్తాడు నేనేం చెయ్యను?'

ప్రకాశం మొహం ఎర్రబడ్డది. 'చావు'—అని అరిచాడు. ఆ అరుపు కొండల్లో ప్రతిధ్వనించినట్టు అతని మనసులో మార్మోగుతోంది. స్కూటర్ స్టార్ట్‌చెయ్యటానికి యీడ్చి తన్నాడు. అది తిరిగి 'కిక్' యిచ్చింది. పెట్రోల్ రిజర్వ్‌లో వుందని జ్ఞాపకం వచ్చింది......పోయినంత దూరమే పోదామని...ప్రకాశం వేగం హెచ్చించాడు. స్కూటర్ రోడ్డువెంట దుమ్ము లేపుకొంటూ వెడుతోంది.

* * *

ఇంజనీర్ మల్లారెడ్డిగాడు ఎదురుగా టేబిల్‌మీదవున్న ఎర్రకాయితాన్ని చూస్తున్నాడు; నిజానికి అదే ఆయన్ని గుడ్లురిమి చూస్తోంది, అది పెద్దచదువు చదువుకొనే ఆయన పెద్ద కొడుకు యూనివర్సిటీనుంచి 'సెన్డ్‌మనీ యిమీడియట్లీ' అని యిచ్చిన రెండో టెలిగ్రాం—

చెక్‌బుక్‌లోని కౌంటర్ ఫాయిల్స్‌లోని మొత్తాలన్నీ కలిపి కూడుకొని ఆ మొత్తాన్ని మరో మొత్తంలోంచి తీసెయ్యగా వచ్చింది—వెధవ మొహం.

దిక్కుతోచక దిక్కులు చూస్తున్న రెడ్డిగారి గదిలో ఒక్క మెరుపు మెరిసింది. తిరిగి చూచాడు. అంతలో వురుము వురిమింది. మిసెస్. సరోజినీ మల్లారెడ్డి బి. ఏ... లిప్‌స్టిక్‌తో ఎర్రగావున్న పెదిమల మధ్య నుంచి నిప్పు వుమ్మేసినట్టుగా వుంది ఆయనకి.

'నాలుగు రోజులైంది...చెక్...యిమ్మని అడిగి...యివ్వాళ పంపకపోతే నా పరువు పోతుంది క్లబ్‌లో ... నా చెక్కు...డిసానర్ అయిందా...'

బంగ్లాదేశ్ శరణార్థుల, సహాయార్థం ఆమె వుదారంగా రు 500/— విరాళం యిచ్చింది. దాన్ని యియ్యటానికి రెడ్డిగారు బంగ్లాదేశ్ యియ్యటానికి యాహ్యాఖాన్ బాధపడ్డట్టు బాధపడుతున్నారు.

మెదలకుండా 'చెక్'రాసి యిచ్చాడు... ఆయనకి తెలుసు 'బేలెన్స్ నిల్' — అని. అయినా ఆయన ఆమెను అసంతృప్తి పరచలేదు. ఆయన బ్రతికేదే ఆవిడకోసం! ఆమే లేకపోతే—ఆమెకు అన్ని అవసరాలే లేకపోతే రెడ్డిగారంత మంచివాడు మరొడుండేవాడు కాదు.

'థేంక్స్'—అని తియ్యగా నవ్వింది. ఆ నవ్వుకో సింపతిటిక్ వైబ్రేషన్ ప్రొడ్యూసయింది ఆయన ముఖంలో— అంతరంగ కోణంనుంచి చూస్తే అదొక వెకిలినవ్వు... వెధవనవ్వు. అంతకంటే మాటనొక్కితే నవ్వే జపాన్ బొమ్మలు ఎంతోనయం! పిల్లిలా బయటికొచ్చాడు. అప్పుడే అవిటికాలుతో కుంటుకుంటూ లోపలికి వొస్తున్న డ్రైవర్ని చూశాడు. పులైపోయాడు.

'ఇప్పుడొస్తే ఎట్టా అనుకొన్నావ్?... నిన్ను డిస్మిస్ చేస్తానని చెడామడా తిట్టాడు.

తలుపులన్నీ మూసి కొట్టిన పిల్లి అయ్యాడు డ్రైవరు.

'మారొగోలీ సాబ్...పచ్చీస్ తారీకైంది... యింకా తనఖా యియ్యలా...ఏమితిని బతకాల సార్?...ఎట్లాగ బ్రతకాల?... పొద్దుకాడ వస్తుంటే సైకిల్ పంచరైంది.. పైసల్ లేక నస్తా బతకతా వచ్చిన' — అన్నాడు ఆయాసంగా.

రెడ్డిగారు 'వీడు నక్సలైటా?' అని అనుమానంగా చూసి 'గోటుహెల్' ముందు 'ఐ' అనుకొన్నాడో 'యు' అనుకొన్నాడో తెలీలేదు. చరచరావెళ్లి జీప్ స్టార్ట్ చేసాడు. ఫ్యూయల్ మీటర్ దాదాపు 'ఎమ్టీ'చూపుతోంది. జీపు ఆకలైన అడవిపందిలా అరిచి బయలుదేరింది.

* *

ఆ మార్గంవెంట జైత్రయాత్ర సాగుతోంది. దుమారం లేచి ఆకసానికంటుతోంది. ఆకలే ఆయుధంగా సాగిపోతున్న వాళ్లు అసహాయులో...అసహాయ శూరులో అర్థం కావటంలేదు. వాళ్లను దూసుకు

పోయిన జీపు అక్కడే నిలబడివుంది. ఇంజనీర్ మల్లారెడ్డి బానెట్ దించేసి ఇక లాభంలేదని గట్టిగా నిట్టూర్చి చెమట తుడుచుకొంటూ సాగిపోతున్న వాళ్లను చూస్తూ నిలబడిపోయాడు.

మరికొంతదూరాన పెట్రోల్ అయిపోయిన స్కూటర్‌ని కాళియమర్దనం చేస్తున్నాడు సూపర్వయిజర్ ప్రకాశం. ఆ యాత్ర అతన్నీ దాటి సాగిపోయింది.

ఎదురుగా ఎత్తయిన గేటుతో వో పెద్ద బంగళా పూర్వపు రాజుల కోటలా కనబడింది. దాన్ని చూడగానే భయపడ్డట్టు సుబ్బారావు గుర్నాధం సైకిల్ టైర్ బరస్టయింది.

జనం సాగిపోతున్నారు. గుర్నాధంకూడా సైకిల్ నడిపించుకొంటూ వాళ్ల వెనకగా వెడుతున్నాడు. జనం గేటు పడదోసుకొని లోపలికి వెళ్లిపోయారు.

బంగ్లాలో ప్రవేశించాడు. అది మరో ప్రపంచంలా వుంది— 'ఇదే స్వర్గం'—అనుకొన్నారు వాళ్లు—అక్కడ చల్లగా వుంది. మెత్తని పరుపులో కూరుకుపోయి ఓ మనిషి పడుకొనివున్నాడు. ఆ మనిషి వుదరం చూడిసీమపంది కడుపులా నిగనిగలాడుతోంది. దానిమీద బంతిలాంటి పిల్లాడు ఆడుకొంటున్నాడు గుమ్మడికాయమీదినిమ్మకాయలాతటస్తనిశ్చలతలో వూగుతున్నాడు.

ఆ మనిషి వాళ్లనుచూసి 'ఏమిటి?'—అన్నాడు. 'కిందటి నెల జీతాలు యియ్యలేదు...మాడి చచ్చిపోతున్నాం' అన్నారు అంతా ముక్తకంఠంతో.

క్రిందనుంచి పైకి...పైనుంచి క్రిందకు అరగంటసేపు ఎంక్వయిరీ జరిగింది. తేలిందేమిటయ్యా అంటే—

అయ్యగారు డబ్బు యియ్యలేదు—

'అయ్యగారూ ... అయ్యగారూ.. డబ్బెందుకు యియ్యలేదు?' అంటే తాళంచెవులు కనబడలేదు—

తాళంచెవులు ఎందుకు కనబడలేదు?

పిల్లవాడు ఆడుకోడానికి తీసుకున్నాడు.

పిల్లవాడా తాళంచెవులేవి?

'తాళం తీస్తే నల్లటిభూతం బయటికొస్తుందన్నావుగా... అందుకని దాచేసా...'

ఆ 'కీ' దొరుకుతుందా? 'అయ్యగారు' డబ్బిస్తాడా? వాళ్లు ఆకలిమంటకి వోర్చుకోలేక తిరగబడి లాక్కుంటారా?—

'కీ'కోసం వెతుకుతున్నారు...ఆ'కీ'లోనే వుంది' 'కీ'లకం— ●



ఈ కలిసికట్టు ఈత ఆట ప్రపంచంలో ప్రసిద్ధిగాంచిన మహిళల క్రీడ. దీనికి ఈతలో చాకచక్యం, ఈదేవారి మధ్య సమన్వయము, లయ అవసరం. ఆడేవారిలో సహనం, సంయమనం, లాలిత్యం ఉండాలి ఈ క్రీడ 1910 ప్రాంతంలో మొదలైంది. ఇటీవల అమెచ్యూర్ ఎథెల్‌టిక్ యూనియన్ జరిపిన ఒక పోటీలో శాంటాకేరా (కాలిఫోర్నియా) యాక్వామెయిడ్స్ జట్టు సీనియర్ నేషనల్ ఇండోర్ ఛాంపియన్‌షిప్‌ని గెలుచుకున్నది. చిత్రంలో నిలబడినవారు ఎమండా నారిష్, జాకీడగ్లస్, రాబిన్ కరెన్, కేతీగ్రాహమ్, కూర్చున్నవారు కిమ్ గాంబెర్మన్, గెయిల్ జాన్సన్, టెరీ ఆండర్‌సన్, గెయిల్ గార్డనర్.

# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

### రైలు ప్రమాదం

మద్రాసు బేసిన్ బ్రిడ్జికి, కొరుకుపేట స్టేషనుకూ మధ్య రైలుకట్టను దాటుతున్న వోహాయన రైలు క్రింద పడి, తునా తునకలై పోయాడట. ఆయన మెడలో ఒక బంగారు గొలుసూ, చేతికి 'యస్—యస్' అని గుర్తున్న వుంగరం వున్నదట. చేతి సంచిలో ఆర్. సుబ్బయ్య, తిరుచ్చి,అని విలాసం వుందట. సుమారుగా 30 ఏళ్ల వయస్సుంటుందని పోలీసు అభిప్రాయ పడి, అతని ఆచూకీకోసం విచారణ ప్రారంభించారు.

### ఆవేశంతో కొడుకుని చంపిన తండ్రి

వేలూరులో 47 ఏళ్ళ రాజాబాదర్ అనే ఆయనకు యిద్దరు భార్యలట. ఆయన వో లారీ కంపెనీలో డ్రయివరు పని చేస్తున్నాడట. మొదటి భార్య కామాక్షికి 24 ఏళ్ళ కొడుకు మణి, ఇంకా ముగ్గురు పిల్లలూ వున్నారట. రెండో భార్య వయిలెట్‌కు పిల్లలు లేరట. రాజాబాదర్ తన రెండో భార్య యింట్లో వుండగా మణి లారీనీ, డ్రయివరును, క్లీనరును తీసుకుని ఆ యింటికి వెళ్ళి "మీ కోసం వీళ్ళొచ్చారు" అని చెప్పాడట. దాంతో రాజాబాదర్‌కు కోపం వచ్చి, 'నా అనుమతి లేకుండా యీ యిల్లు వీళ్ళందరికీ చూపిస్తావురా' అని కొప్పడి, అంతతో ఆగక, ఎగిరి గంతేసి, తన కొడుకు మణి పొట్టలో వో గుద్దు గుద్దాడట. అంతే! మణి గిరగిర తిరిగి, క్రిందపడి, విలవిల తన్నుకు చనిపోయాడట — కలిమహత్యమా!!

### ఆత్మహత్యకి కారణం?

వేలూరు ఆఫీసర్ల లైనులో వున్న వో హోటల్లో ఆ హోటలు సర్వరు 25 ఏళ్ళ శంకర్ అనే యువకుడు విషంత్రాగి మరణించాడట. అతని ఆత్మహత్యకు కారణం ఏమీ తెలక తికమకపడుతోందట పోలీసు.




### భాగస్వామి హత్యోదంతం

న్యూయార్కులో 56 ఏళ్ళ శామ్ బరన్స్ అనే యువకుడు తన వ్యాపారంలో భాగ స్వామిని కత్తితో పొడిచి చంపి (18వ తేదీ) ఆ తరువాత తనశేష జీవితం కటకటాలవెతల గడపడాని కిష్టపడక ఆ ఇరవయ్యేడంతస్తుల భవనం మీంచి ఝామ్మని క్రిందికి దూకేశాడట. అతన్ని చావకుండా చిక్కించుకోవాలని పోలీసులు గమ్మున వలపరచి పట్టుకున్నా, శామ్ నేరుగా క్రిందే పడి పచ్చడై పోయాడు.

### నూతిలో విషవాయువు

పుదుక్కన్నంలో చొక్కలింగం మొదలియార్ అనే ఆయన తన పొలంలో పాడై యున్న వో నూతిని బాగు చేయించాలని వో ఆరుగురు కూలీలను పెట్టారట. ఆ ఆరుగురిలో నలుగురు సగం వరకు దిగితే, మిగతా యిద్దరూ పొంతం దిగి, టప్పున స్పృహతప్పి, నీళ్లలో పడిపోయారట. దానితో మిగిలిన నలుగురూ బాబోయ్ రక్షించండి అని కేకలు వేస్తే, ఆ కేకలు విన్నవారు వెంటల నార్పు వారికి తెలియజేస్తే, వారు అట్టహాసంగా వచ్చి ఆ నలుగుర్నీ బయటకి తీశారట. ఆ నూతిలో ఏదో విష వాయువు పుట్టినట్టు పోలీసు అన్నదట.

### కరుణానిధి కారుకి దెబ్బలు

ఉత్తర మైసూరులో తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి వో మహా సభలో మాట్లాడి తిరిగివెళ్తుండగా ఆయన కారుమీద టపటప రాళ్లు పడ్డాయట. ఎవ్వరికీ, చివరికి కారుకూ కూడా గాయాలు ఏర్పడక పోయినా రాళ్లు రువ్విన ఏడుగురిని పట్టుకుంటే మధురాంతకం కోర్టు వారికి తలా ఒకనెల జైలుశిక్ష బహూకరించిందట—వార్నీ!

### నిరశన వ్రత సన్మానం

ప్రపంచ శాంతి కోసం బెంగుళూరులో జైన మతానికి చెందిన తాప్రు భాయి అనే ఆవిడ 121 రోజులు కేవలం మంచి నీళ్లే త్రాగుతూ నిరశన వ్రతం చేస్తే అన్నాళ్ల వ్రతం చేయగలిగి నందుకు ఆమెను మైసూరు స్టేటు గవర్నరు ముఖ్యమంత్రి మొదలైన వారు బెంగుళూరు లాల్‌భాగ్ అద్దాల మేడలో సన్మానించారట—ఫన్నీ.

### లారీనించి పడిన క్లీనర్ మృతి

బంగారుపేటనుంచి రాబర్ట్‌సన్‌పేట కల్లు సీసాలు మోసుకుపోతున్న ఒక లారీమీంచి వెంకటప్ప అనే యువకుడు కింద పడ్డాడట. అతను ఆ లారీ క్లీనరుట. పడీ పడ్డంలో లారీ క్రిందకు అతని రెండు కాళ్ళూ పడి, నలిగి పచ్చడయిపోయాయట. ఆనక రాబర్ట్‌సన్ ఆసుపత్రిలో చేరుస్తే అక్కడతను చనిపోయాడట.

### పరీక్షతప్పిన విద్యార్థి ఆత్మహత్య

బెంగళూరు సిటీ— కంటోన్మెంటు స్టేషన్ల మధ్యలో పోతున్న వో రైలింజను క్రింద యువకుడొకడు గమ్మున దూకాడట. దాంతో అతనిశరీరం మూడు ముక్కలై పోయిందట. ఆతని జేబులో దొరికిన వో వుత్తరాన్నిబట్టి అతని పేరు సుబ్బరావ్ అని తెలిసిందట. 'యస్. యస్. యల్. సి. పరీక్షల్లో ఫెయిలయినందుకు నేను ఆత్మహత్య




చేసుకుంటున్నాను" అని స్థూలంగా అసలు విషయం వుందటా వుత్తరంలో.

### పైకప్పు కూలినా బ్రతికిన శిశువు

కోలారులో వో యిల్లు పైకప్పు కూలి, మీద పడినందుకు ఫలితంగా 30 ఏళ్ళ బషీర్ అనే ఆయన, ఆయనిద్దరు పిల్లలు (8 ఏళ్ళు, 6 ఏళ్ళు ఆ కప్పు క్రిందపడి చనిపోయారట. బషీర్ భార్య, రెండ్రోజుల పసిగుడ్డు మాత్రం ఏ విధమైన దెబ్బలూ కూడా తగలకుండా తప్పించుకున్నారట

### ఇల్లుకూలి ఆరుగురి మరణం

డిసెంబరు 8 వ తేదీ వానల ఫలితంగా ఊటీలో మార్కెట్టు ప్రాంతంలో వో యిల్లుకూలి, ఆ యింట్లో నిద్రపోతున్న ఒకే కుటుంబానికి చెందిన ఆరుగురూ చనిపోయారట. వానకురుస్తున్నపుడు ఆ యింట్లో 40 ఏళ్ళ మహమ్మద్, ఆయన భార్య సఫీదా వారి నలుగురు పిల్లలూ నిద్రపోతున్నారట. ఆ యిల్లు వున్నపళంగా కూలి, ఆ ఆరుగుర్నీ భూస్థాపితం చేసిందట.

విరహ తాపాన్ని తెచ్చింది దుర్వాసన!




DC.G.41 TL

# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంత క్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటింపబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. ఎంత చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!

పూర్తి దంత రక్షణకు
**కాల్గేట్ టూత్ బ్రష్**
వాడండి
15 రకములలో. ప్రతివారికి
అనువైనది లభించును.

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...
ఎక్కువ మంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్ కంటే కాల్గేట్‌నే కొంటారు!



## ఒకవారం విపరీతం

### చెట్టు కూలి భార్యాభర్తల మరణం

కడలూరు పుదునగర్ ప్రాంతానికి చెందిన కణ్ణన్ అనే ఒకాయన తన కుటుంబంతో ప్రభుత్వ ఆసుపత్రి ప్రక్కనో పాకలో వుంటూండేవాడట. డిసెంబరు 8 వ తేదీన రాత్రి కురిసిన వాన ఫలితంగా ఆ గుడిశ పక్కనున్న చెట్టుకూలి, గుడిశ మీద పడిందట. దాంతో కణ్ణను, అతని భార్య ఆ చెట్టు క్రింద పడి, నలిగి, చనిపోయారట. వారి ముగ్గురు పిల్లలూ మాత్రం స్వల్ప గాయాలతో బయట పడ్డారట.

### ఆరవ కాన్పులో ముగ్గురాడపిల్లలు!

ఆర్కాటుకు చెందిన కళాంబాడిలో 50 ఏళ్ళ జయరామనాయుడు మొదటి భార్య సంతానవతి కాకుండానే చనిపోడంవల్ల జయరామనాయుడు పద్మావతి అనే ఆమెను పెళ్ళి చేసుకున్నాడట. ఆమెకు అయిదు కాన్పులయి, ఆరవ కాన్పులో మొన్న చక్కగా ముగ్గురు పిల్లలు పుట్టారట. ఈ ముగ్గురూ ఆడపిల్లలేనట.

### రైల్లో ఉరి!

మధుర రైల్వే స్టేషనులో చివ్వరి ప్లాట్‌ఫారం ప్రాంతంలో వున్న వో రైలు పెట్టెలో ఒక ఆసామీ శవం దొరికిందట. తువ్వాలుతో ఆయన రైలు పెట్టెలో ఉరిపోసుకు చనిపోయాడట. అసలాయనెవరు? ఏ ఊరివాడు? హత్యా, ఆత్మహత్యా అన్న ప్రశ్నలకు కారణాలు పోలీసు వెతుకుతోంది.




### అదుపుతప్పిన బస్సు

డిసెంబరు ఆరవ తేదీ కూనూరు నుంచి మెట్టుపాలాయం వెళుతున్న ప్రయాణీకుల బస్సు బ్రేకులు పాడైపోయాయట. దాంతో బస్సును ఆపడం కుదరక, డ్రైవరు తన అసమర్థత నెలుగెత్తిచాటాడట. చూస్తుండగానే బస్సు రోడ్డుమీద నడుస్తున్న యిద్దరాడువాళ్ళను నలిపి చంపి, వో చెట్టుకు గుద్దుకుని, స్థిరపడిందట. ఆ వూపుకు బస్సులో ప్రయాణం చేస్తున్న వారిలో వో యిద్దరాడవారు చనిపోయారట. పెక్కుమందికి గాయాలు తగిలాయట.

### నటి జయలలితపై నేరారోపణ

అక్టోబరు నెల 20 వ తేదీ దసరా వుత్సవాల సందర్భంగా మైసూరు రాష్ట్రంలో వో నాట్య కచ్చేరీ చేయడానికి ఒప్పుకుని, నటి జయలలిత రూ 5,500 ఎడ్వాన్సు తీసుకున్నదట. కానీ రాష్ట్రంలో కన్నడుల గలాటాలకు భయపడి (కారణం మరోకటైనా అయ్యుండచ్చుగాక!) తన ప్రోగ్రాం రద్దు చేసుకున్నదట. ఎడ్వాన్సు డబ్బు ఆనక (అక్టోబరు 21 న) ఇస్తానన్నదట. ఈ సంఘటనను ఆధారంగా చేసుకుని, ఆమె మోసం చేసినట్టు ఆమె మీద నేరారోపణ చేయడంవల్ల ఆమె మైసూరులో షూటింగులో వుండగా, మేకప్‌తో వున్నాసరే పోలీసులు వచ్చి ఆమెను పోలీసు స్టేషనుకు తీసుకువెళ్ళి, కొన్ని గంటల తరువాత వదిలారట. అంతేగాక, ఆమె వున్న హోటలుకు కొంతమంది జనాన్ని పంపి, గలాటా కూడా చేయించారట. దాంతో జయలలిత తన షూటింగు రద్దు చేసుకుని, హోటలు వెనుకభాగం నుంచి బయటపడి, మద్రాసు చేరిందట. ఈ విషయాన్ని వివరిస్తూ ఆమె ఇందిరాగాంధికి రాసిందట. మైసూరు రాష్ట్ర చట్టసభలో యీ విషయం చర్చకు వచ్చిందిట. ●

## సినిమా

### నందమూరికి రామకృష్ణ

గతవారం వార్తల్లో నటసామ్రాట్ నాగేశ్వరరావుకు, చిత్రకల్పనవారి చిత్రం లోని పాటలను యువగాయకుడు రామ కృష్ణ పాడారు అని వ్రాశాను.

అదే గాయకుడు డి. వి. ఎస్. వారి కొత్త చిత్రంలో నటరత్న రామారావుకు అన్ని పాటలను పాడడానికి బుక్ అయ్యారు.

### డి. వి. ఎస్. ప్రారంభం

ప్రముఖ నిర్మాత డి. వి. ఎస్. రాజు తన కొత్త చిత్రాన్ని డిశంబరు 11 న ప్రారంభించారు. అదేరోజున పాటల రికార్డింగు కూడా జరిగింది. ఈ చిత్రానికి టి. వి. రాజు సంగీత సారధి. డాక్టర్ నారాయణరెడ్డి అన్ని పాటలను వ్రాస్తున్నారు. ఇప్పటికి మూడింటిని రికార్డు చేశారు. సుశీల, రామకృష్ణ ఆలాపించారు.

ఒక లాయరు జీవితానికి సంబంధించిన కథ యిది, అన్నారు నిర్మాత రాజు. ఈ కథకి సముద్రాల, జాన్సన్ రచయితలు. ప్రధాన పాత్రలను రామారావు, జమునలతో బాటు చంద్రమోహన్, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, ముక్కామల, వెన్నిర ఆడై, రత్న, వరలక్ష్మి పోషిస్తున్నారు సి. ఎస్. రావ్ దర్శకత్వంలో తయారయ్యే యీ చిత్రానికి జి. కె. రాము ఛాయను, కళాధర్ కళను నిర్వహిస్తున్నారు. విజయా విడుదల.



'పంజరంలో పసిపాప'లో హలం.

### విజయా ప్రొడక్షన్స్

విజయా ప్రొడక్షన్స్ నిర్మించిన చిత్రాలలో 90 శాతం విజయఢంకా మ్రోగించి వున్నాయి అన్న విషయం జగద్విదితం.

గత ఏడు ఏండ్లనుండి విజయా వాళ్ల చిత్రం ఎప్పుడు, ఎప్పుడు అన్న ఆతురత ప్రజల్లో యేర్పడింది. అతి త్వరలో ఒక సముజ్వల సాంఘికాన్ని నిర్మించబోతున్నారు, నాగిరెడ్డి—చక్రపాణిగార్లు.

### వాణిశ్రీ ద్విపాత్రాభినయం

ఈ చిత్రంలో వాణిశ్రీ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వుంటుంది. ఈ కథ ప్రస్తుతం హిందీ చిత్రరంగంలో కని, విని, ఎరుగని వసూళ్లను ఆర్జించి పెడుతూ వుంది. ఈ చిత్రానికి డి. వి. నరసరాజు సంభాషణలను, రమేష్‌నాయుడు సంగీతాన్ని, దాశరధి పాటలను సమకూరుస్తున్నారు. అఖిలభారత ప్రశస్తినందిన తాపీ చాణక్య దర్శకత్వంలో యీ చిత్రం తయారవుతుంది.

### విజయా విడుదలచేసే ఏ. వి. ఎమ్. చిత్రం

మనకున్న మంచి పంపిణీ సంస్థల్లో విజయా ఒకటి అంటే తప్పు లేదనుకుంటా. ఈ పంపిణీ సంస్థ అనేకమైన విజయవంతమైన చిత్రాలను విడుదల చేసియుంది. ఈ సంస్థ ద్వారా ఏ. వి. ఎమ్. నిర్మించిన మరొక మంచి చిత్రం త్వరలో విడుదలవుతుంది.

### పుట్టినిల్లు—మెట్టినిల్లు

ఈ చిత్రం తమిళంలో 'పుగుందవీడు' పేరిట కొత్త (పుదూ) రికార్డులను సృష్టించింది. ఈ చిత్రం ద్వారా తమిళ మార్కెట్టుకు పట్టు అనే ప్రతిభావంతుడు లభించాడు. తెలుగు చిత్రానికి కూడా ఆయనే దర్శకుడు.

### చంద్రకళ—లక్ష్మి

'పుట్టినిల్లు—మెట్టినిల్లు' చిత్రానికి ఎన్. ఆర్. నంది మాటలను, సత్యం



అందానికి ప్రతిబింబం మోడల్ సుందరి లిజ్ హూలీ.

సంగీతాన్ని, మారుతీరావు ఛాయను నిర్వహించారు. నాయక పాత్రలను కృష్ణ, శోభన్; శోభన్—కృష్ణ పోషింప, నాయిక వేషాలను లక్ష్మి, చంద్రకళ ధరించారు. కృష్ణ తండ్రిగా నాగయ్య, శోభన్ తల్లిగా సావిత్రి నటించారు. ఈ చిత్రంలో రాజబాబు తండ్రి, కొడుకుగా రెండు పాత్రలను పోషించాడు. అతగాడికి జంటగా రమాప్రభ కనిపిస్తుంది.

## ఏ. వి. ఎమ్.

## జెమినీలలో శోభన్

'పుట్టినిల్లు — మెట్టినిల్లు' తర్వాత నిర్మించేబోయేది కలర్‌లో తయారవుతుందని, తను కథానాయకుడిగా నటించబోతున్నానని శోభన్‌బాబు చెప్పారు,

జెమినీ సంస తనతో నిర్మించనున్న చిత్రంకూడా ఈస్ట్‌మన్ కలర్‌లో తయారవుతుంది, అన్నారు జగన్ పాత్రధారి. ఈ చిత్రంలో వాణిశ్రీ నాయిక, నిర్మాత బాలన్‌గారే దర్శకుడు.

## ఖైదీ బాబాయ్!

శ్రీ బాలాజీ చిత్ర ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న చిత్రానికి 'ఖైదీ బాబాయ్'అని పేరు పెటారు, ఈ చిత్రానికి ఎడిటరు కృష్ణ దర్శకుడు. కథానాయికగా వాణిశ్రీ నటిస్తోంది. ఒక విశిష్టమైన పాత్రను

# సినిమా

షావుకారు జానకి పోషిస్తోంది. ముఖ్య భూమికలను జగ్గయ్య, గుమ్మడి, సత్యనారాయణ, పద్మనాభం ధరిస్తున్నారు. ఈ చిత్రానికి సుందరంబాబు ఛాయను, మహాదేవన్ సంగీతాన్ని, బొల్లిముంత రచన్ను చేపట్టారు లక్ష్మీ ఫిలింస్ విడుదల చేస్తుందీ చిత్రాన్ని.

## ఆదుర్తి చిత్రాలు!

'విచిత్ర బంధం' చిత్రం ఆదుర్తి సంపాయించుకున్న కీర్తిని యినుమడింప చేసింది. ఆయన స్వంత చిత్రం 'మాయదారి మల్లిగాడు' శరవేగంతో తయారవుతూ వుంది. ఈ చిత్రంలో కృష్ణ, మంజుల, జయంతి ముఖ్య తారాగణం.

తెలుగులో వచ్చిన 'అక్కా—చెల్లెలు'హిందీ చిత్రాన్ని వీనస్ పిక్చర్స్ ఆదుర్తి దర్శకత్వంలో నిర్మిస్తున్నారు. అక్కినేని పాత్రలో ప్రాణ్ కనిపిస్తారు. నాయకీ నాయకులుగా తనూజ, విజయ్‌అరోరా నటిస్తున్నారు. 'షావుకారు' జానకి పాత్రలో వహీదా కనిపిస్తుంది.

'పండంటి కాపురం' హిందీ వెర్షన్ జనవరిలో ప్రారంభమవుతుంది. ఆదుర్తి—వీనస్ కలిసి నిర్మించే యీ చిత్రంలో వహీదా, మాలాసిన్హా, నీటూసింగ్, ఓంప్రకాశ్ ప్రధాన పాత్రలను పోషిస్తారు.

హీరో కృష్ణ పద్మాలయా మూవీస్ పేరిట నిర్మించనున్న తెలుగు చిత్రాన్ని కూడా ఆదుర్తి డైరెక్ట్ చేస్తారు.

ఆదుర్తి అంగీకరించదలిస్తే, మరొక మూడు కంపెనీలు రెడీగా వున్నాయి. ట్యాలెంటు వున్న వ్యక్తుల్ని అవకాశాలు వెతుక్కుంటూ వస్తాయి.

## అనిత

## సినిమా అవుతూంది!

'మనసు — మాంగల్యం' నిర్మాత కె. కుటుంబరావు త్వరలో రెండవ చిత్రాన్ని ప్రారంభించే ప్రయత్నాలను పూర్తిచేశారు. ప్రముఖ రచయిత్రి ఆనందారామం వ్రాసిన 'అనిత'ను, సినిమాగా నిర్మించే హక్కులను కుటుంబరావు కొన్నారు. అనితగా జమున నటించే యీ చిత్రంలో కృష్ణ కథానాయకుడిగా అంగీకరించారు.

## మరువలేను...

నాయిక జమున ప్రోత్సాహం, సహకారం నేను మరువలేను అన్నారు నిర్మాత. నాచేత మరొక సినిమాను తీయించాలి అన్న ఆమె పట్టుదలే నా రెండవ చిత్ర నిర్మాణం అని నిర్మాత పేర్కొన్నారు. అలాగే కృష్ణ కూడా తన సంపూర్ణ సహకారాన్ని, సహాయాన్ని యిస్తానని వాగ్దానం చేశారు. ఈ చిత్రానికి గొల్లపూడి మారుతీరావు మాటలను, పెండ్యాల సంగీతాన్ని సమకూరుస్తారు.

'బుల్లెమ్మ — బుల్లోడు' దర్శకుడు నాగాంజనేయులు 'అనిత'కు డైరెక్షన్ను చేపట్టగలరని తెలుస్తోంది. అన్నయ్య సంగీతానికి దర్శకుడయితే, తమ్ముడు చిత్రానికి దర్శకుడయ్యాడు. షూటింగు జనవరిలో ప్రారంభమవుతుందని తెలిసింది.

## జీవితం విచిత్రమైనది

'జీవితం చాలా విచిత్రమైంది. ప్రతి మనిషి తన జీవితం నిండుగా పండాలనీ, పండువెన్నెల్లా హాయిగా వుండాలనే కోరుకుంటాడు కానీ అందరి కోరికలు అందిరావు. ముక్కుకు సూటిగా నడవాలను కొన్నా పక్కదార్లు పట్టించి మనిషిని తల్లక్రిందులు చేస్తుంది జీవితం. ఆనాడు



'ప్రేమపక్షులు'లో చంద్రకళ, ప్రకాష్.

సుధ చచ్చిపోయిందని నమ్మి, నిన్ను పెండ్లి చేసుకున్నాను. నమ్మే సుధ చచ్చిపోయిందని నీతో చెప్పాను. అంతేగాని నిన్ను మోసం చేద్దామని కాదు. కాని విధి వశాత్తు అది అబద్ధంగా మారిపోయింది. ఆ ఒక్క అబద్ధమే నాచేత వెయ్యి అబద్ధాలు ఆడించింది. ఇతరుల మనసు కష్టపెట్టడం ఇష్టంలేక నా మనస్సును నేనే వంచించుకున్నాను. పోనీ ఆనాడే నీతో నిజం చెప్పినా — నువ్వు నమ్మేదానివా ? సుధ మన అందరిమధ్య మన ఇంట్లో వుండడాన్కి అంగీకరించేదానివా? ఆమాట కొస్తే ఏ స్త్రీ హృదయము ఒప్పుకోదు. ఏ పాపం ఎరుగని, మాలతి, మధుల బ్రతుకులు బజారుపాలు గాకుండా వుండాలంటే నేనేం చెయ్యాలి ? అందరి జీవితాలు సుఖంగా కళకళలాడుతుండాలి. అందుకు నేనేం చెయ్యాలి ? మనిషి జీవితానికి విలువ పెంచేది నిజమే అయినా ఆ జీవితం నిలుపుకోడాన్కి మనిషి అబద్ధం కూడా ఆడుతుండాలేమో ! దానికి ఒకటే మార్గం – నాటకం, నాటకం ఆడాలి.'

ప్రతి మనిషి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు అబద్ధం చెప్పక తప్పదు. అయితే అబద్ధం ఒక్కొక్కప్పుడు జీవితాన్ని సుడిగుండంలోకి తోస్తుంది.

ప్రసాద్, కమల, సుధల మధ్య జరిగిన సుడిగుండాల జీవితమే శ్రీధర్ ప్రొడక్షన్సు వారి 'జీవితం'.

# సినిమా

బాక్సాఫీసు దర్శకులు కె. యస్. ప్రకాశరావు దర్శకత్వంలో తయారౌతున్న ఈ చిత్రంలో శోభన్‌బాబు, శారద, జయంతి, కృష్ణంరాజు, నిర్మల ముఖ్యపాత్రలు ధరించారు. సూర్యచంద్రరావు, గిరిబాబులు నిర్మిస్తున్న ఈ చిత్రానికి మాటలను భమిడిపాటి, పాటలను నారాయణరెడ్డి, కెమెరాను సత్యనారాయణ, కూర్పును బి! గోపాలరావు, సంగీతాన్ని రమేష్‌నాయుడు నిర్వహించారు లక్ష్మీ ఫిలింస్ విడుదల.

## జీవనతరంగాలు

వాతావరణం వుద్రిక్తస్వరూపాన్ని దాల్చింది. విజయ్, రోజా చాలా సూటిగా మాట్లాడుకుంటున్నారు. పది మందిలో తన మనసుకు నచ్చినట్టు ప్రవర్తించే రోజాను తమ్ముడు అనంత్ ప్రేమిస్తున్నాడని తెలిసి అది ఇష్టంలేని లాయరు విజయ్ రోజాతో మాట్లాడాన్కి వచ్చాడు. వాదోప వాదాలు జరిగాయి. విజయ్ అవేశాన్ని అపుకోలేక

'అనంత్‌ను వదలివేయడాన్కి నీ కెంత డబ్బు కావాలి?' అన్నాడు.

'మీ రిచ్చేది అనంత్ డబ్బేగా?' అంది రోజా తేలికగా. ఆవేశాన్ని ఆపుకోలేక 'రోజా, షటప్' అన్నాడు విజయ్.

'ఇదీ అంతంతమాత్రానికి రేకులురాలే రోజా కాదండీ?' అంది, అరుపులకు నేను బెదరను అన్నట్టు.



'స్త్రీ'లో చంద్రకళ, చంద్రమోహన్.

'నేను పట్టినకేసు అంతంత మాత్రంగా వదిలే లాయర్ను కాను' అన్నాడు పట్టుదలగా.

'ఐతే మనద్దిరిదీ మంచి జోడీ అన్నమాట? కానీండి, ఎవరు గెలుస్తారో చూద్దాం' అంది రోజా సవాలు చేస్తున్న ధోరణిలో.

'సరే...ఒకటి మాత్రం గుర్తుంచుకో, యముడికి దయాదాక్షిణ్యాలు లేవు. ఎంతటి ప్రేమికులనైనా విడదీస్తాడు' అన్నాడు హెచ్చరిస్తున్నట్టు విజయ్.

'మీరూ గుర్తుంచుకోండి. మమ్మల్ని దేవుడుగూడా విడదీయలేడు' అంది రోజా.

'అల్‌రైట్' అదీ చూస్తానన్నట్టు విసురుగా వెళ్లిపోయాడు విజయ్.

పొగలురేగి సెగలుగామారే ఈ సన్నివేశం అభ్యుదయ నిర్మాత రామానాయుడు సురేష్ మూవీస్ పతాకం క్రింద నిర్మిస్తున్న 'జీవన తరంగాలు' లోనిది.

తాతినేని రామారావు దర్శకత్వం నెరవుతున్న ఈ చిత్రంలో శోభన్‌బాబు, గుమ్మడి, కృష్ణంరాజు, పద్మనాభం, చంద్రమోహన్, రావికొండలరావు, వాణిశ్రీ, లక్ష్మి, సూర్యకాంతం నటిస్తున్నారు.

నవయుగ విడుదల చేయనున్న ఈ చిత్రానికి మాటలను పినిశెట్టి, కెమెరాను యస్. వెంకటరత్నం, సంగీతాన్ని రాఘవులు, ఆర్టును యస్. కృష్ణారావు, ఎడిటింగ్‌ను మార్తాండ్, సహకార దర్శకత్వాన్ని సుబ్బారావు, అసోసియేట్ దర్శకత్వాన్ని చెరువు ఆంజనేయశాస్త్రి నిర్వహించారు.

## స్త్రీలో ఒకదృశ్యం

అంతస్థులు మనుష్యుల హృదయాల్లో కాకుండా వ్యక్తుల ఆస్తిపాస్తులమీద ఆధారపడి వున్నాయనే మిధ్యాభ్రమలో వుండే లక్షాధికారి మిల్ ఓనర్ లక్ష్మీపతి అయితే ఆయన రక్తం పంచుకుపుట్టిన బిడ్డ నిర్మల అందుకు పూర్తిగా విరుద్ధం. వాచ్‌మన్ గంగయ్య కొడుకు చంద్రంతో బాగా పరిచయం అయింది. పరిచయం క్రమంగా మరో రూపం ధరించాక చంద్రం నిర్మల కోసం లక్ష్మీపతి యింటికి వచ్చాడు. చంద్రాన్ని కూర్చోమని లోపలికి వెళ్లింది నిర్మల. లక్ష్మీపతి వచ్చి చంద్రాన్నిచూసి— 'ఎవరు' అని ప్రశ్నించాడు.

'నా పేరు చంద్రం.' సౌమ్యంగా చెప్పాడు చంద్రం.

అప్పుడే కల్పించుకొన్నాడు లక్ష్మీపతి గారి పెద్దల్లుడు రాజారావు.

'అదే, మామగారూ...మన ఫ్యాక్టరీలో వాచ్‌మన్ గంగయ్యలేడూ అతని కొడుకు' అన్నాడు తేలికగా.

'ఏమిటీ, వాచ్‌మన్ కొడుకా! కాలి మీద కాలేసుకొని దర్జాగా కూచుంటే, ఏ కలెక్టర్ కొడుకో, గవర్నర్ మనవడో అనుకున్నాను' అన్నాడు లక్ష్మీపతి ఆశ్చర్యం, ఆవేశం జోడిస్తూ.

'నిర్మలగారు పిలిచారు...' అన్నాడు చంద్రం.

'వచ్చినదారినే వెడితే బాగుంటుంది' అన్నాడు రాజారావు.

'ఆ మాట పిలిచినవాళ్ళు చెప్పాలి. మీ మర్యాదకి చాలా సంతోషం'అన్నాడు చంద్రం.

'మా యింటికి వచ్చి మాకే మర్యాదలు నేర్పుతున్నావ్...? పైగా మా నాన్నగార్నే ధిక్కరించి మాట్లాడుతున్నావే?' అంది ఇందిర ఆవేశంగా.

'గెటవుట్' అరిచాడు రాజారావు.

అప్పుడే కాఫీ ట్రేతోపాటు వచ్చిన నిర్మల.

'బావా! ఇటీజ్ టూమచ్...నాన్నా వార్ని నేనే రమ్మన్నాను' అంది. వాతావరణం వుద్రిక్తస్థితిని ధరించటం చూసిన చంద్రం

'నిర్మలా! నేను వచ్చి మీలో కలతలు రేపడం నాకు ఇష్టం లేదు. వస్తాను' అంటూ లేచాడు.

'వెళ్ళండి! మా కుటుంబంలో మనిషి కిచ్చే మర్యాద ఏమిటో చూశారుకదూ!' అంది బాధగా నిర్మల.

'నువ్వేం బాధపడవద్దు...వస్తాను'అంటూ వెళ్లిపోయాడు చంద్రం.

ఈ వుద్రిక్త వాతావరణం ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో పూర్ణా మూవీస్‌వారి 'స్త్రీ' చిత్రంలో చూడొచ్చు, అట్లూరి పూర చంద్రరావు, ఎం. చంద్ర శేఖర్లు నిర్మిస్తున్న ఈ చిత్రానికి రాచ కొండ విశ్వనాథ్‌శాస్త్రి సంభాషణలను వ్రాయ, మహదేవన్ సంగీతం సమకూర్ప, కెమెరాను శేఖర్—సింగ్ నిర్వహిస్తున్నారు.

ప్రఖ్యాత దర్శకులు ప్రత్యగాత్మ దర్శ కత్వం నెరపుతున్న ఈ చిత్రంలో

# సినిమా

చంద్రకళ, కృష్ణంరాజు, చంద్రమోహన్, ధూళిపాళ, నూతన నటుడు సత్యనారాయణ దీక్షిత్ ముఖ్యపాత్రలు ధరిస్తున్నారు.

## కృతజ్ఞత

'నేను విలన్‌పాత్ర ధరించినా, కథా నాయకుడి వేషం వేసినా, నన్ను ఆదరించి, అభిమానించే ఆంధ్ర ప్రేక్షకులకు శతకోటి నమస్కారాలు తెలుపుకుంటున్నాను. మున్ముందుకూడా నా పాత్రలను విమర్శ నాత్మకంగా పరిశీలించి, నాలోని తప్పు, ఒప్పులను తెలియచేయవలసినదిగా కోరుతు న్నాను' అన్నారు హీరో కమ్ విలన్ పాత్ర ధారి కృష్ణంరాజు,

'ప్రత్యగాత్మ దర్శకత్వంలో తయారైన 'స్త్రీ' చిత్రంలోని తన విద్యార్థి నాయకుని పాత్ర, ఆంధ్ర ప్రజలను మెప్పించగలిగితే, నా నట జీవితంలో కొత్తదారి యేర్పడు తుంది.' అన్నారు కృష్ణంరాజు.

## శ్రీవారు—మావారు

మహావిష్ణు ప్రొడక్షన్స్ నిర్మించే 'శ్రీవారు—మావారు' చిత్రం షూటింగు డిశంబరు షెడ్యూలుతో పూర్తయింది. ఈ చిత్రానికి బొల్లిముంత మాటలను, రామ కృష్ణారావు ఛాయను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని నిర్వహించారు. బి.ఎస్. నారాయణ



**హిందీ నటి జయభాదురి.**

(చిత్రకారుడు : శ్రీ కొండూరు నాగేశ్వరరావు)

స్వంత చిత్రం యిది. నాయకీ. నాయకులుగా వాణిశ్రీ, కృష్ణ నటించారు. ప్రధాన పాత్రలను కృష్ణంరాజు, పద్మనాభం, అంజలీదేవి, గీతాంజలి, రాంమోహన్ మరియు నాగభూషణం పోషించారు, ఫిబ్రవరిలో యీ చిత్రం పూర్ణాద్వారా విడుదలవు తుంది.

పై చిత్రంలో రామకృష్ణారావు ఛాయా గ్రహణం సుపర్బ్‌గావుందని పలువురి వువాచ. వీరి చాతుర్యం మీకు తెలియనిదికాదు. 'ఉండమ్మా బొట్టు పెడతా, ప్రయివేటు మాస్టారు' చిత్రాలే సాక్ష్యాలు. శ్రీవారు— మావారుగాక 'మాయదారి మల్లిగాడు' చిత్రానికికూడా రామకృష్ణారావు ఛాయను నిర్వహిస్తున్నారు.

## రమేష్ నాయుడు...

'అమ్మమాట' పాటలు బహుళ ప్రజా దరణ పొందడంతో, రమేష్ నాయుడికి డిమాండ్ పెరిగింది. శ్రీధర్ ప్రొడక్షన్స్ వారి 'జీవితం', ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి 'తాతా—మనవడు' చిత్రాల్లో రమేష్ వినిపించిన బాణీలకు పలువురి ప్రశంసలు లభించాయి. ఇప్పుడాయనకి విజయా ప్రొడక్షన్స్‌వారి చిత్రం వచ్చింది.

## వీనస్ కంబైన్స్!

ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న సాంఘిక చిత్రం 13 రీళ్లు వచ్చింది, అన్నారు నిర్మాత గోవిందరాజన్. ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ మాటలను వ్రాయ, మహదేవన్ సంగీతాన్ని సమకూర్చారు. విక్టరీని వరంగాగొన్న మధుసూదనరావు యీ చిత్రానికి నిర్దేశకులయితే, 'విచిత్ర బంధం' ఫేం సెల్వరాజ్ ఛాయను చేపట్టారు.

'నేను ధరిస్తున్న మంచి పాత్రల్లో యిదొకటి. మానసిక సంఘర్షణకు లోనైన వుత్తమ నాయకునిపాత్ర యిది' అన్నారు కథానాయకుడు అక్కినేని. ఈ చిత్రంలో నాయిక లిద్దరు వున్నారు. వాణిశ్రీ, కాంచన ఆ పాత్రలను పోషించారు. సహాయ భూమిక లను రాజబాబు, పద్మనాభం, రమాప్రభ, సత్యనారాయణ, హలం నిర్వహించారు. సహాయ దర్శకత్వాన్ని కోదండ రామిరెడ్డి, కాట్రగడ్డ మురారి చూస్తున్నారు. ఇప్పటికి

ఆరు పాటలు చిత్రీకరించబడ్డాయి. మరో రెండు పాటలు ఒకటి హాస్య జంటపైన, మరొకటి కాంచనపైన చిత్రీకరించబడితే, షూటింగు పూర్తయినట్లే, అన్నారు దర్శకుడు వి. మధుసూదనరావు. నవయుగ విడుదల. ఈ చిత్రంలో రామారావు అనే నూతన గాయకుడి గొంతును వింటారు మీరు.

## స్టేషన్‌మాష్టరు పాత్రలో అక్కినేని

నట సామ్రాట్ నాగేశ్వరరావు వెయ్యని సాంఘిక పాత్రలేదు. రిక్షావాడు మొదలుకొని వున్నత కుటుంబీకుడు వరకు అన్నిరకాల పాత్రలను ప్రతిభావంతంగా పోషించియున్నారు.

జగపతి ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'బంగారు బాబు' చిత్రంలో అక్కినేని స్టేషన్ మాష్టరు వేషాన్ని ధరించారు.

## చెల్లెలుగా జయంతి

అక్కినేనికి తండ్రిగా ఎస్వీరంగారావు, చెల్లెలిగా జయంతి నటించారు. ఈచిత్రాన్ని వి. బి. రాజేంద్రప్రసాద్ నిర్మించారు. ఛాయను ఎస్. వెంకటరత్నం, కూర్పును సంజీవి, సంగీతాన్ని మహదేవన్, కళను కృష్ణారావు నిర్వహించారు.

## డాక్టరుగా జగ్గయ్య!

'బంగారు బాబు'లో డాక్టరు పాత్రను జగ్గయ్య పోషించారు. ఆయన చెల్లెలిగా, కథానాయిక భూమికను వాణిశ్రీ నిర్వహించింది. విలన్‌గా నాగభూషణం, హాస్యజంటగా రాజబాబు, రమాప్రభ నటించారు. ఈ రంగుల చిత్రాన్ని ఏళ్లతరబడి జ్ఞాపకం వుండే విధంగా దర్శకుడు రాజేంద్రప్రసాద్ శ్రద్ధ తీసుకున్నారు. కథను, సినిమా అనుకరణను ఆయనే వ్రాయ, మాట, పాటలను ఆచార్య ఆత్రేయ సమకూర్చారు. ఈ చిత్రం జనవరి 11న అన్నపూర్ణాద్వారా విడుదలవుతుంది.

## రామరాజ్యం పూర్తయింది

మంచి చిత్రాలనువ్వాత్రమే ప్రజలకు అందివ్వాలి అన్న ధ్యేయంతో పయనం సాగించే అపూర్వ సహోదరులే రామవిజేత ద్వయం అని పాఠకులకు అనేకసార్లు తెలియచేశాను.

లోగడ యీ సంస్థ సమర్పించిన మూడు చిత్రాలకు ప్రజాదరణ లభించడంతో, 'రామరాజ్యం'ను మరింత గొప్పగా నిర్మించారు ఈ చిత్రంలో బాబురావు ప్రతిభ అడుగడుగునా గోచరిస్తుంది. కథ నడిపించడంలో ఆయన తీసుకునే శ్రద్ధ, నటీనటులకు ఆయన యిచ్చే శిక్షణ ఎంతటిదో 'రామరాజ్యం'చూస్తే మీకు తెలుస్తుంది.

'రామరాజ్యం'ద్వారా శరత్ అనే నూతన నటుడ్ని పటిష్ఠమైనపాత్రలో మెప్పించడానికి బాబురావు ఎంత పాటుపడ్డాడో? తమ్ముడికి అండగా నిర్మాత ప్రభాకర్ ఇచ్చే సహాయ సహకారాలసారమే వీరు మంచి చిత్రాలనిచ్చేందుకు దోహదం చేస్తుంది. ఈ చిత్రానికి ఎస్వీ రంగారావు, గుమ్మడి, రాజబాబు, ప్రభాకరరెడ్డి, సావిత్రి, చంద్రకళ పాత్రలు ముఖ్యమయితే, జగ్గయ్య పాత్ర జీవనాడై కూర్చుంటుంది. ఈచిత్రం లక్ష్మీ ఫిలింస్‌ద్వారా విడుదలవుతుంది. డిశంబరుకు షూటింగుపూర్తయింది. రామవిజేతా అందించే మరొక ఆణిముత్యమే 'రామరాజ్యం' చిత్రం.



'బంగారుబాబు'లో నాగేశ్వరరావు. వాణిశ్రీ.

## మధు పిక్చర్స్‌కి మధుసూదనరావు

'మంచి కుటుంబం' లాంటి మంచి సాంఘిక కథను ప్రేక్షకులకు అందించిన మధు పిక్చర్స్ మల్లికార్జునరావుగారి కొత్త చిత్రం జూన్‌లో ప్రారంభమవుతుంది. ఈ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు. అక్కినేని కథానాయకుడి పాత్రను పోషిస్తారు.

## మధు మూవీస్‌లో శోభన్

'కళ్యాణ మంటపం' చిత్రం తర్వాత దర్శకుడు వి. మధుసూదనరావుకు స్వంతమైన మధు మూవీస్ మరొక సముజ్వల సాంఘికాన్ని ఏప్రిల్‌లో ప్రారంభిస్తారట; ఈ చిత్రం కలర్‌లో నిర్మిత మవుతుందని, తను హీరోగా నటించనున్నానని శోభన్ చెప్పారు.

-శ్రీనివాస్ ●

12—1—73

## పిల్లల పెంపకం...

(24వ పేజీ తరువాయి)

తిట్టడం ఎన్నడూ చెయ్యకూడదు. తరవాత మందలించాలి, లేకపోతే పిల్లలు నలుగురిలోనూ లోకువైపోతారు. పిల్లలు అబద్ధాలు చెప్పడం చిన్నచిన్న వస్తువులు దొంగిలించడం చేస్తూ వుంటారు. ఆ పనులకు కూడా చాలావరకూ తల్లితండ్రులే బాధ్యులు. ఎందుచేతనంటే బాల్యావస్థలోనే ఇలాంటివి అలవాటవుతాయి. అవి వారు చేసినప్పుడు వారు ఎందుకు చేస్తున్నారో తెలియకుండా చేస్తారు. దానికి తల్లిదండ్రులు నవ్వేసి చూసీ చూడనట్లు వూరుకుంటారు లేదా వాడు చేసిన ఘనకార్యానికి పొంగిపోతారు. పిల్లవాడు కూడా చాలా మంచిపని చేశానని ఆదేపని మరలా చేస్తాడు. ఇంట్లో నలుగురు పిల్లలున్నప్పుడు, పెద్దపిల్లల వస్తువులు పెన్సులు, రబ్బరు మొదలైనవి, చిన్నపిల్లలు లాక్కు పరుగెత్తుతారు. అదే మొదటిస్టేజి. అప్పుడే పిల్లల్ని, పెద్దలు మందలించాలి.

సాధారణంగా పిల్లలు ప్రతిపని అనుభవం మీద నేర్చుకుంటారు. ఏదయినా పెద్దవారు వద్దంటే ఆపనే వాళ్ళకి చెయ్యాలని వుంటుంది. ఆపని చేస్తే ఏమి నష్టమో వారికి తెలియదు. ఒకసారి చేశాక అనుభవం వస్తుంది. దానివల్ల జరిగిన నష్టం వారికి జ్ఞాపకం వుండి ఆ పని ఇంకెన్నడూ చెయ్యరు. పిల్లలలో ఇమిటేషన్ చాలా ఎక్కువగా వుంటుంది. ఎప్పుడు పెద్దవారి ప్రవర్తనమీద కన్నువేసి వుంచుతారు ఆ! చిన్నపిల్లాడేగా వాడికేం తెలుసు, అని పిల్లల ఎదురుగా అసభ్యంగా ప్రవర్తించేవారెందరో వుంటారు. దానివల్ల పిల్లల వ్యక్తిత్వం దెబ్బతింటుంది.

పిల్లల భవిష్యత్తు ఉజ్వలంగా ఉండాలీ అంటే తల్లితండ్రుల ప్రవర్తనకు ప్రముఖస్థానం వుంటుంది. ఆతరవాత స్కూలు, టీచర్సు. ఏదో స్కూలుకు వెళుతున్నాడు వస్తున్నాడు అని వూరుకోకుండా, రెగ్యులర్‌గా పిల్లల ప్రోగ్రెస్ గూర్చి. అడిగి తెలుసుకుంటూ వుండాలి. క్రొత్త కొత్త పనులు చెయ్యడానికి తగిన ధైర్యం సాహసం, నమ్మకం కలిగించాలి. తల్లితండ్రులను చూసి పిల్లలు భయపడే పరిస్థితి ఎన్నటికీ రాకూడదు. వారిద్దరిమధ్య స్నేహపూర్వకమైన సంబంధం వుండలి. ప్రతి తల్లితండ్రీ, తమ పిల్లల మనస్తత్త్వాన్ని (సైకాలజీ) అర్థం చేసుకుని ప్రవర్తించాలి. వారిలో దాగివున్న శక్తుల్ని ప్రజ్వలింప చెయ్యాలేగాని, మనకున్నకోపం, అహంకారరతో వారి కోమలమైన కోరికల్ని అణిచి వెయ్యకూడదు. పిల్లల మానసిక వికాసంలో పరిపూర్ణత లభించాలి అంటే, తల్లితండ్రుల బిహేవియర్ (ప్రవర్తన) కు ప్రధానస్థానం వుంటుంది.

— డి. లీల ●




జీవుల్లో లైంగికత్వం స్థిరమైనదేనా? ఒకసారి స్త్రీ జీవిగా లేదా పురుషజీవిగా జన్మించిన జీవి అదే గుణంతోటే జీవితాంతం ఉండిపోతుందా? లేకపోతే మార్పుకు అవకాశం ఉందా?

సృష్టిలో కొన్ని జీవరాసుల్లో అసలు ఈ స్త్రీ పురుషతత్వాలు ఉండనే ఉండవు. కేవలం అలైంగిక గుణం కలిగిఉంటాయి. సంతానోత్పత్తికి శరీరవిభజన తోడ్పడుతుంది. మరికొన్ని జీవుల్లో స్త్రీ పురుషతత్వాలు రెండూ ఉంటాయి. వానపాము దీనికి మంచి ఉదాహరణ. ప్రతి వానపాము మగదీ, ఆడదికూడా. అయితే అనేక ఇతర జీవుల్లో స్త్రీ, పురుష విభేదం ఉంటుంది.

ఈవిధంగా ఒకజీవి స్త్రీ, లేదా పురుషుడు కావడానికి ముఖ్యంగా దాని క్రోమోసోముల తత్వం సహాయపడుతుంది. సృష్టిలో స్త్రీ, పురుష సంఖ్య సరిసమానంగా ఉండడానికి వీలుగా ఈ లైంగిక నిర్ణయవిధానం సహాయపడుతుంది.

స్త్రీ పురుషజీవులు వాటికి తగినట్లుగా జననేంద్రియాలు కలిగి ఉంటాయి. ఆ జననేంద్రియాలు కొన్ని హార్మోనులు స్రవింపజేయడంవల్ల అవి నిర్వర్తించవలసిన పనులు జరుపుకోగల్గడమూ వాటి బాహ్యలక్షణాలు, మానసిక తత్వాలు ఏర్పడడమూ జరుగుతాయి.

కొన్ని కొన్ని సందర్భాలలో ఏదో 'పొరపాటు' జరిగి స్త్రీజీవి పురుషునిగాను, పురుషజీవి స్త్రీగాను మారడానికి అవకాశం ఉంది. గుడ్లు పెట్టే కోడి పెట్టలు క్రమంగా పుంజు లక్షణాలు పెంపొందించుకోడం గమనించే ఉంటారు. పెట్టలు గుడ్లు పెడుతూ ఉండి, కొంతకాలం పోయాక, పింఛము పెంచుకొని, కొక్కొరోకోఅని అరుస్తూ, పుంజుగామారి పెట్టలతో కూడి తండ్రులయిన సందర్భాలు లేకపోలేదు, ఇలా అనేక ఇతర జీవుల్లోకూడా గమనించారు మనిషికూడా ఈ శక్తి నార్చిడికి లొంగిపోయినట్లు వింటూంటాం.

సీరియల్

ముగ్గురు మూర్ఖులు చెప్పిన

# అనగనగా ఒక తండ్రి

మహేష్

### జరిగిన కథ

రామ్మూర్తికి ఇద్దరు కొడుకులూ, ఒక కుమార్తె. పెద్దవాడు ప్రసాద్ ఉద్యోగం చేస్తున్నాడు. రెండవ వాడు కొంచెం అల్లరిచిల్లరగా తిరుగుతుంటాడు. కుమార్తె లక్ష్మి పెళ్ళికి ఎదిగి వుంది. భార్య శాంతమ్మ రోగిష్టిది. కాంచన ప్రసాద్ ఆఫీసులోనే పని చేస్తున్నది. ప్రసాద్ కాంచనా ప్రేమలో పడ్డారు. అందుచేత తండ్రి తెచ్చిన సంబంధానికి ప్రసాద్ ఇష్టపడలేదు. ప్రసాద్, కాంచనలు మరింత దగ్గరయ్యారు. పెళ్ళి చేసేసుకున్నారు. ప్రసాద్‌కి పిల్లనివ్వాలను కున్న సత్యనారాయణకిది చాలా బాధ కలిగింది. రామ్మూర్తిని అపార్థం చేసుకున్నాడు. ఆలస్యంగా వచ్చాడన్న సాకుతో అతన్ని ఉద్యోగంలోనుంచి తీసేశాడు. లక్ష్మికి సంబంధాలు చూస్తున్నారు. పెద్ద కొడుకు ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. కుమార్తె పెళ్ళికి ఇల్లు తనఖాపెట్టి, ఆ డబ్బును కొడుకు చేతికిచ్చాడు రామ్మూర్తి. ప్రసాద్ ఆ డబ్బును స్వంతం చేసుకున్నాడు. పైగా ఆస్తిలోనూ, ఇంటిలోనూ వాటా అడిగాడు. భార్యకి రజనీకుమార్ కథ చెప్పాడు రామ్మూర్తి. శాంతమ్మగారికి జాగా జబ్బు చేసింది. లక్ష్మి కంగారు పడింది. చిట్‌ఫండ్‌కి సంబంధించిన డబ్బును రాజా తీసుకుపోయాడు. రామ్మూర్తిని పోలీసులు పట్టుకున్నారు.

## 15

మర్నాడు ఉదయం డాక్టరు వచ్చి శాంతను పరీక్షించి, ఇంజక్షను యిచ్చాడు.

'మీ అమ్మగారికి కొంచెం సేపట్లో తెలివి వస్తుంది. నాన్నగారు వచ్చారా?' అని లక్ష్మిని ప్రశ్నించాడు డాక్టరు.

'రాలేదండి'

'వెంటనే మీ నాన్నగారు రావడం అవసరం. మీ అమ్మగారు నాన్నగారిని చూస్తే తప్ప, యే యింజక్షన్లూ, మందులూ పని చెయ్యవు మీ అన్నయ్యను వెళ్ళి జామీను యిచ్చి తీసుకురమ్మని చెప్పు.

దానికి సమాధానం యేమీ యివ్వలేదు.

'మధ్యాహ్నం నేను ఊరికి వెడుతున్నాను. అవసరం అయినప్పుడు కబురు పంపితే కాంపౌడరు వస్తాడు. మీ అమ్మగారికి యివ్వవలసిన మందుల గురించి అతనితో చెబుతాను'

'అలాగేనండి' అన్నది లక్ష్మి ముభావంగా.

డాక్టరు వెళ్ళిపోయాడు.

తరువాత కొంచెం సేపటికి శాంతకు తెలివి వచ్చింది. శాంత మెల్లగా కళ్ళు విప్పి చూసింది. ఎదురుగా లక్ష్మి కన్పించింది.

'మీ నాన్నగారు వచ్చారా?' అని లక్ష్మిని నీరసంగా ప్రశ్నించింది శాంత.

'రాలేదమ్మా! అన్నయ్య వెళ్ళాడు. జామీను యిచ్చి నాన్నగారిని తీసుకొని వస్తాడు' అన్నది లక్ష్మి తన విచారాన్ని సాధ్యమైనంతవరకు కన్పించనీయకుండా.

'నువ్వూ నాతో అబద్ధాలు చెప్పడం ప్రారంభించావన్నమాట' అన్నది శాంత తనలోతాను అనుకొన్నట్లుగా.

'లేదమ్మా! నాన్నగారు తప్పకుండా వస్తారు' అన్నది లక్ష్మి.

'నిజం చెప్పు! ప్రసాద్ మీ నాన్నగారిని తీసుకొని రావడానికి నిజంగా వెళ్ళాడా?' అని శాంత అంత నీరసంలోను ఓపిక తెచ్చుకొని ప్రశ్నించింది లక్ష్మిని.

'అమ్మా! ముందు నువ్వు కాఫీతాగు. తరువాత అంతా చెపుతాను' అంటూ లక్ష్మి కాఫీ తేవడానికి లోపలకు వెళ్ళింది.

తన మాటకు సమాధానం చెప్పకుండా, లక్ష్మి యెప్పుడు లోపలకు వెళ్ళిపోయిందో, 'ప్రసాద్ తండ్రిని తీసుకొని రావడానికి వెళ్ళ లేదు' అనే విషయం అప్పుడే శాంతకు అర్థం అయింది.

'ఇదుగో, కాఫీ! అంటూ లక్ష్మి కాఫీ తీసుకొని వచ్చింది,

'నువ్వు కాఫీ తాగావా?'

'ఇదుగో నువ్వు కాఫీ తాగిన తరువాత నేను తాగుతాను' అన్నది లక్ష్మి.

దానికి శాంత యేమీ మాట్లాడలేదు.

లక్ష్మి తల్లి రెండు భుజాలు పట్టుకొని, లేవనెత్తి, కూర్చోబెట్టడానికి ప్రయత్నించింది కాని శాంత యెంతమాత్రం కూర్చోలేకపోయింది. తల్లియొక్క స్థితి చూడగానే లక్ష్మికి చాలా భయం వేసింది. తల్లి పడుకొని ఉండగానే లక్ష్మి చంచాతో కొంచెం కొంచెం కాఫీ ఆమె నోట్లో పోసింది. దాన్ని కూడా శాంత అతి కష్టం మీదనే తాగ గలిగింది.

తల్లికి జబ్బు చేసినప్పటినుంచీ, లక్ష్మికి భయంగానే ఉంది. అయినా క్రమంగా ఆమెకు ఆరోగ్యం చేకూరుతుందనే ఆశ లక్ష్మికి యే మూలనో ఉండేది. కాని ఆవేళ తల్లి పరిస్థితి చూడగానే ఆ ఆశ

పూర్తిగా పోయింది.

నిజంగా అప్పుడు తల్లికి యేదైనా జరిగితే, తను యేం చెయ్యాలి?

ఇంట్లో డబ్బూ లేదు. సహాయం చెయ్యడానికి మనుషులూ లేరు. తను పూర్తిగా నిస్సహాయురాలు.

అటువంటి పరిస్థితి యేర్పడినట్లయితే తాను యే ఉరిపోసుకోవడమో తప్ప మరో మార్గం యేదిలేదు.

'ఏమో, యీ లోపున నాన్న తిరిగి యింటికి రాకూడదా?' అనే ఆలోచన ఆమెకు రాగానే గబగబా వీధిలోనికి వెళ్ళి చూసింది. కాని తండ్రి తిరిగి రావడం ఆమెకు కన్పించలేదు. నిరాశగా ఆమె తిరిగి యింట్లోకి వచ్చింది.

'మీ నాన్నగారు వచ్చారా?' అని లక్ష్మిని ప్రశ్నించింది శాంత అతి నీరసంగా.

'వస్తారమ్మా! కొంచెం సేపట్లోనే వస్తారు' అని తల్లికి సమాధానం యిచ్చింది లక్ష్మి.

తల్లి బలవంతం చెయ్యడం వల్ల లక్ష్మి వంట చేసుకొని, కొంచెం అన్నం తిన్నది.

'తండ్రి వస్తున్నాడేమో', అనే ఆశ కొద్దీ లక్ష్మి మాటి మాటికి వీధి గుమ్మం లోనికి వచ్చి చూసేది కాని తండ్రి రావడం కన్పించలేదు.

ఇంట్లో తల్లి మాటి మాటికి 'మీ నాన్నగారు వచ్చారా?' అని లక్ష్మిని ప్రశ్నించేది.

'వస్తారమ్మా! కొంచెం సేపట్లో వస్తారు అన్నయ్య తీసుకొని వస్తాడు' అని లక్ష్మి తల్లికి సమాధానం చెప్పేది.

ఈ విధంగా ఆ పగలు గడిచి పోయింది. ఆ రాత్రి శాంతకు సరిగ్గా నిద్రపట్టలేదు. కొంచెం సేపు నిదపట్టినా, ఆ నిద్రలో కూడా భర్తను గురించి కలవరించేది.

గుండె రాయి చేసుకొని లక్ష్మి తల్లికి అలాగే సపర్య చేసింది.

మర్నాడు ఉదయం శాంతకు నీరసం యింకా యెక్కువ అయింది. 'యిక తాను యెంతసేపో బ్రతకబోయేదిలేద'ని ఆమె తెలుసుకొంది.

తల్లి నీరసం చూసి, లక్ష్మి డాక్టరును తీసుకొని రావడానికి వెళ్ళబోయింది తనకు యే డాక్టరూ, యిక అవసరంలేదని తల్లి, అడ్డు చెప్పింది. ఆ స్థితిలో తల్లిని కొద్ది నిముషాలపాటు కూడా విడచిపెట్టి ఉండడానికి లక్ష్మి మనస్సు కూడా అంగీకరించలేదు. అందుచేత ఆమె తల్లివద్దనే ఉండి పోయింది.

'మీ నాన్నగారు వచ్చారా ?' అని శాంత మామూలు ప్రశ్న వేసింది.

'వస్తారమ్మా! ఇంక కొంచెం సేపట్లో వస్తారు. అన్నయ్య తీసుకొని వస్తాడు' అన్నది లక్ష్మి, తల్లి మంచం మీద కూర్చుంటూ.

'పిచ్చితల్లీ! ఇంకా నన్ను మోసం చేస్తున్నావా ?'

'అమ్మా! ముందు నువ్వు కొంచెం కాఫీ తాగు!' అని అంటూ లక్ష్మి తల్లి మంచంవద్దనే ఉంచిన కాఫీ ఫ్లాస్కుతీసి గ్లాసులో కాఫీ పోసింది.

'ఇంకా నాకు యీ కాఫీలు యెందుకమ్మా! కొద్దిసేపట్లో నేను వెళ్ళి పోతున్నాను' అన్నది శాంత.

'అమ్మా!'

'అవునమ్మా! నాకు నీగురించే బెంగ. మగపిల్లలిద్దరూ, అలాగ చేశారు. నీ భవిష్యత్తేమిటో ఆ భగవంతుడికే తెలియాలి. ఈ



విషయంలో నిన్ను నేలకరించే వాళ్ళు కూడా యెవరూ లేరు' అంటూ శాంత కళ్ళనీళ్ళు పెట్టుకొంది.

పొంగివస్తున్న దుఃఖాన్ని లక్ష్మి అంతవరకు యెలాగో ఆపుకొన్నది కాని ఆ సమయంలో దుఃఖాన్ని ఆపుకోవడం ఆమెకు సాధ్యం కాకపోయింది.

తల్లి చేతులు పట్టుకొని లక్ష్మి కూడా కళ్ళనీళ్ళు పెట్టుకొంది.

'మావంటి నిర్భాగ్యుల యింట్లో పుట్టడంవలన నీ బ్రతుకు కూడా యిలాగ అయిపోయింది. ఊరుకో! తల్లీ! ఊరుకో!' అంటూ శాంత లక్ష్మి కళ్ళ నీళ్ళు తుడిచింది.

అప్రయత్నంగా లక్ష్మి కూడా, అదే సమయంలో తల్లి కళ్ళ నీళ్ళు తుడిచింది.

అంతట్లో వీధిలో యేదో రిక్షా ఆగిన చప్పుడు అయింది. లక్ష్మి ఆతృతగా గుమ్మం దగ్గరకు వచ్చి చూసింది. వీధిలో రిక్షా దిగుతున్న తండ్రి కన్పించాడు.

లక్ష్మి కంగారుగా తల్లి మంచం దగ్గరకు వచ్చి 'అమ్మా! అమ్మా! నాన్న వచ్చాడు' అన్నది.

'తల్లీ! నాతో యింకా అబద్ధాలు చెప్పుతున్నావా?' అన్నది శాంత నిరాశగా.

'కాదమ్మా! నిజంగానే నాన్న వచ్చాడు' అని లక్ష్మి అంటుండగానే 'శాంతా! శాంతా! అని పిలుస్తూ రామ్మూర్తి లోపలకు వచ్చాడు

రామ్మూర్తి వెనుకనే, రమారమి

# అనగనగా...

యిరవై సంవత్సరాల వయస్సు కల ఒక యువకుడు, లోపలకు వచ్చాడు. లక్ష్మి అతన్ని చూసింది కాని 'తండ్రి తిరిగి యింటికి వచ్చాడు' అనే సంతోషంలో ఆమె అతన్ని గురించి పట్టించుకోలేదు.

భర్తమాట వినబడగానే శాంత 'ఏమండీ! వచ్చారా?' అంటూ లేవడానికి ప్రయత్నించింది కాని లేవలేక పోయింది.

'వద్దు, శాంతా! లేవకు' అంటూ రామ్మూర్తి దగ్గరకు వచ్చి శాంత పడుకున్న మంచంమీదనే కూర్చున్నాడు.

శాంత 'వచ్చారా?' అంటూ భర్త చేతులు పట్టుకొంది.

'నీ వంట్లో యెలాగ ఉంది?' అని ప్రశ్నించాడు రామ్మూర్తి.

'ఒకటే ఉండడం. మిమ్మల్ని చూడడం కోసమే యీ ప్రాణాలు యింకా నిలబడున్నాయి' అంది శాంత నిరాశతో కూడిన చిన్న నవ్వుతో.

'ఊరుకో. శాంతా! అవేం మాటలు?' అన్నాడు రామ్మూర్తి మందలిస్తున్న ధోరణిలో.

'చూడు. నాన్నా! అమ్మ పొద్దుటి నుంచీ కాఫీకూడా తాగలేదు' అని లక్ష్మి ఫిర్యాదు చేస్తున్నట్లుగా అంటూ కాఫీగ్లాసు తండ్రి చేతికి యిచ్చింది.

ఆ గ్లాసులో ఉన్న చంచాతో, రామ్మూర్తి భార్య నోటిలో కాఫీ పోయడం ప్రారంభించాడు. శాంత యింకేమీ మాట్లాడకుండా తాగడం ప్రారంభించింది.

అయిదారు చంచాల కాఫీ తాగిన తరువాత శాంతకు రామ్మూర్తి వెనుకను నిలబడ్డ యువకుడు కన్పించాడు.

కాఫీ తాగడం ఆపి, శాంత 'ఎవరండీ ఆ అబ్బాయి?' అని భర్తను ప్రశ్నించింది.

రామ్మూర్తి పటుక్కున యేదో జ్ఞాపకం వచ్చినవాడిలాగ వెనక్కు తిరిగి చూసి, 'బాబూ! నీమాటే మరచిపోయాను. అలాగ కూర్చో!' అంటూ ఆ యువకుడికి ఒకబల్ల చూపించాడు.

శాంత మంచానికి దగ్గరగా ఉన్న ఆ బల్లమీద అతను కూర్చున్నాడు

తరువాత రామ్మూర్తి భార్యవైపు తిరిగి 'శాంతా! కొన్నాళ్ళ క్రిందట నీకు ఒక సంగతి చెప్పాను. జ్ఞాపకం ఉందా?' అంటూ రామ్మూర్తి చెప్పడం ప్రారంభించాడు.

'సుబ్రహ్మణ్యం అనే ఆయన 'రజనీకుమార్' అనే అబ్బాయిని పెంచాడని చెప్పాను. గుర్తు ఉందా? ఆ రజనీకుమారే యితను. సుబ్రహ్మణ్యం యెవరోకాదు శాంతా! నేనే. ఈ రజనీకుమారను పెంచాను. చిట్‌ఫండు కంపెనీ వాళ్ళకు రెండువేలరూపాయలు మన రజనియే చెల్లించి, నన్ను పోలీసుస్టేషన్నుంచి నీ దగ్గరకు తీసుకొని వచ్చాడు యితనే మన రజని' అంటూ రామ్మూర్తి సంతోషంగా రజనీకుమార్ భుజంమీద చెయ్యివేశాడు.

భర్తచెప్పిన మాటలు వింటున్నప్పుడు, శాంతముఖంలో ఆశ్చర్యం, సంతోషం ఒకదానితో ఒకటి పోటీ పడుతున్నట్లుగా కన్పించాయి.

శాంత యెంతో వాత్సల్యంతోకూడిన కంఠంతో 'రా, బాబూ! యిలాగ కూర్చో' అంటూ తనమంచం చూపించింది.

'బాబూ! యిలాగ కూర్చో' అంటూ రామ్మూర్తి శాంత మంచంమీదనుంచి లేచాడు.

రజనీకుమార్ బల్లమీదనుంచి శాంత మంచంమీద కూర్చున్నాడు.

శాంత రజనీకుమార్ రెండుచేతులూ పట్టుకొంది. ఆమెకు సంతోషం, విచారం రెండూకూడా ఉప్పెనలాగ పొంగాయి

'బాబూ! ఈ ఆఖరు సమయంలో మి



బాబుగారిని తీసుకొనివచ్చి, నాకు చూపించావు. నీ ఋణం తీర్చుకోలేను బాబూ' అంది శాంత. ఆమె కళ్ళలోంచి నీరు ప్రవహిస్తూ ఉంది.

అంతవరకు తనను పెంచిన రామ్మూర్తి గారి యింటికి వచ్చాననే భావం, అప్పటికి ఆ యింట్లో ఉన్న దైన్యస్థితి, రజనీకుమార్ హృదయాన్ని మొట్టమొదటి కదలించి వేశాయి.

'లేదమ్మా! ఇది నా విధి. శిశువుగా రోడ్డు పక్కను పడిఉన్న నన్ను, బాబుగారే పెంచి పెద్దవాణ్ణి చేశారు. ఎంతచేసినా, నేనే మీ ఋణం తీర్చుకోలేనమ్మా!' అన్నాడు రజనీకుమార్. అతని కళ్ళలోకూడా నీళ్ళు తిరిగాయి.

'లక్ష్మీ! మీ నాన్నగారికి, అన్నయ్యకు కాఫీ తీసుకొని రా!' అన్నది శాంత లక్ష్మిని చూస్తూ.

అంతవరకు జరుగుతున్న సంభాషణను ఆశ్చర్యంగా వింటూ, బొమ్మలాగ నిలబడ్డ లక్ష్మి. తల్లిమాటతో మళ్ళా ఈ లోకంలో పడింది.

'ఇదుగోనమ్మా! యిప్పుడే తెస్తా' అంటూ లక్ష్మి వంటింట్లోనికి వెళ్ళింది.

శాంతకు అంతలో యేదో ఆలోచన వచ్చింది. తరువాత ఆమె భర్తవైపు చూస్తూ, 'ఏమండీ!' అని పిలిచింది.

'ఏం శాంతా! ఏం?' అంటూ రామ్మూర్తి వచ్చి, శాంత మంచానికి రెండవ వైపున కూర్చున్నాడు.

భర్త రెండుచేతులు పట్టుకొని శాంత 'ఏమండీ లక్ష్మిపెళ్లి' అంది విచారంగా.

వెంటనే రామ్మూర్తి 'చేస్తాను. శాంతా! లక్ష్మిపెళ్లి త్వరలోనే చేస్తాను' అన్నాడు.

లక్ష్మికి పెళ్లిచేసే స్తోమత తనవద్ద లేదని రామ్మూర్తికి బాగా తెలుసును. అయినా భార్యకు సంతృప్తిని కలిగించడానికిగాను అతను యెంతో ధైర్యంగా భార్యతో ఆమాట అన్నాడు.

భర్త మాటలు విని శాంత విచారంగా కళ్ళు మూసుకొంది. ఆమాటలు ఆమెకు నమ్మకాన్నిగాని, సంతృప్తినిగాని కలిగించలేక పోయాయనే విషయాన్ని రామ్మూర్తి, రజనీకూడా గ్రహించారు.

'అమ్మా?' అని పిలిచాడు రజని.

శాంత మెల్లగా కళ్ళు విప్పి రజని ముఖం

లోనికి చూశారు.

'అమ్మా! లక్ష్మి పెళ్లిగురించి నువ్వేం ఆలోచించ నక్కరలేదమ్మా! లక్ష్మి పెళ్లి నేను చేస్తాను. నామాట నమ్మమ్మా! లక్ష్మికి పెళ్లి చెయ్యకుండా నేను పెళ్లి చేసుకోను' అన్నాడు రజని శాంత ముఖం లోనికి చూస్తూ.

రజని చెప్పిన మాటలను విన్న శాంత, రామ్మూర్తి తమ చెవులను తామే నమ్మలేక పోయారు. రామ్మూర్తి ఆశ్చర్యంగా రజని వైపు చూశాడు.

శాంత కూడా 'ఇదంతా నిజమేనా?' అన్నట్లుగా రజని ముఖంలోనికి చూసింది.

'అవునమ్మా! లక్ష్మి పెళ్లి నేను చేస్తాను. మీ చేతిలో చెయ్యివేసి చెపు తున్నాను.' అన్నాడు రజని శాంత చేతులు




పట్టుకొని.

'బాబూ!' అన్నది శాంత సంతోషంగా.

లక్ష్మి పెళ్లిగురించి అంతవరకు ఆమెను దహించి వేస్తున్న విచారం ఒక్కసారి తొలగి పోయింది. ఆమె ఆనందానికి అవధులు లేవు. రజని మాటలు ఆమె చెవుల్లో అమృతవర్షాన్ని కురిపించాయి.

'అమ్మా? మన లక్ష్మిపెళ్లి నేను చేస్తాను. దాన్నిగురించి నువ్వేం బెంగ పెట్టుకోవద్దమ్మా!' అన్నాడు రజని శాంతను బతిమాలితున్నట్లుగా,

'లేదు. బాబూ! నాకు యిప్పుడు యేం బెంగా లేదు. మీ బాబుగారిని తీసుకువచ్చి యీ ఆఖరుక్షణంలో నాకు చూపించావు. లక్ష్మి పెళ్లి చేస్తానని మాట యిచ్చావు. అభిమానంతో 'అమ్మా!' అని పిలిచే బిడ్డవు నువ్వు దగ్గర ఉన్నావు. ఇప్పుడు నా మనస్సు యెంతో తేలిగ్గా ఉంది. సంతోషంగా నేను వెళ్లిపోతాను బాబూ!' అన్నది శాంత ఆయాసపడుతూ.

ఇంతలో లక్ష్మి రెండుగ్లాసులతో కాఫీ తీసుకొని వచ్చి, ఒకగ్లాసు తండ్రి చేతికి యిచ్చింది. రెండవగ్లాసు రజని చేతికి యివ్వబోయింది లక్ష్మి.

శాంత ఆయాసపడుతూనే, అంతలో 'లక్ష్మి! ఆ కాఫీ యిలాగ యియ్యి!' అంటూ చెయ్యిచాపింది;

ఆ సమయంలో 'శాంత కాఫీ తనకు యిమ్మని యెందుకు అడుగుతున్నదో యెవరికీ అర్థంగాలేదు. అయినా లక్ష్మి యేమీ మాట్లాడకుండా కాఫీగ్లాసు తల్లికి యిచ్చింది. శాంత వణుకుతున్న చేతులతో ఆ గ్లాసు పట్టుకొంది.

'ఈ ఆఖరుక్షణంలో 'అమ్మా' అని పిలిచిన నీకు యీ అమ్మ యింతకంటే యేమీ యివ్వలేదు బాబూ!' అంటూ శాంత ఆ కాఫీగ్లాసు యెత్తి రజని నోటికి అందించబోయింది.

ఆ మాతృప్రేమకు రజని యేమీ మాట్లాడలేక పోయాడు. గ్లాసు పట్టుకొని వణుకుతున్న ఆమె చేతులమీద తన చేతులు వేసి పట్టుకొని రజని అలాగే రెండు గుక్కలు కాఫీ తాగాడు.

అంతలోనే శాంత కాఫీగ్లాసు వదిలేసి 'అమ్మా' అంటూ గుండెలమీద చెయ్యి

# రామనాథన్ క్రిష్ణన్ కి ప్రియమైన కాఫీ:

# నెస్‌కాఫీ !



"ఉత్తేజ కల్పనకు దక్షిణాది కాఫీ గింజలతో తయారయిన కాఫీకి దీటులేదు. నా కాఫీ మోస్తరు... నెస్‌కాఫే."

అతనికి తెలుసు కాఫీకి అలవడినవారికి తెలిసినట్టు. ఇతర ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న నెస్‌కాఫే విశిష్టమని దానిని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారని అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో.




## నెస్‌కాఫీ

నెస్‌కాఫీ యిక్కడి ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది

ACIL-90(2) 233 TEL

# కాకి గుడ్లగూబల కలహం



ధర్మపథం — బుడసు వెంకటరమణయ్య

పక్షులన్నిట్లో కాకి చాలా నీచస్వభావం గలదనీ, చెడ్డదనీ ప్రసిద్ధి. గృధ్రరాజైన జటాయువనే పక్షి రావణుడు ఎత్తుకొని పోతూ వున్న సీతాదేవిని రక్షించుటకై ప్రాణాలనే సమర్పించగా కాకాసురుడనే లంటా పక్షి ఆమెశరీరమాంసాన్ని తిని, రక్తం తాగడానికి సిద్ధపడిందికదా!

ఈ కాకి నిష్కారణంగా గుడ్లగూబతో విరోధం తెచ్చుకుంది. ఆ విరోధం శాశ్వతంగా ఉండిపోయింది.

పక్షులకు గరుత్మంతుడు రాజుగదా! అతడు ఎప్పుడూ విష్ణువుదగ్గరే వుండడం వల్ల పక్షులు తమ కష్టసుఖాలు ఆతనితో చెప్పుకోడానికి అవకాశం లేకుండా ఉంటున్నది. అందువల్ల మరొక పక్షిని రాజుగా ఏర్పాటు చేసుకోవాలని కొన్ని పక్షులు ఆలోచించి, తగిన వారిని ఎన్నుకోడానికి ఒక సభ చేశాయి. ఈ విషయం కాకికి తెలియదు. అది ఎప్పుడూ దేశసంచారం చేస్తూనే ఉంటుంది.

పక్షులు సభచేసి గుడ్లగూబను రాజుగా నిర్ణయించాయి. అది కొంత పెద్దదిగా శత్రుభయంకరంగా ఉండడం దానికి కారణం. ఒక శుభముహూర్తం నిర్ణయించి, దివాంధానికి పట్టాభిషేకం చెయ్యడానికి తగిన ఏర్పాట్లు చేశాయి.

పట్టాభిషేకదినం వచ్చింది. పక్షులు ఎంతో హడావిడిగా ఉన్నాయి. గుడ్లగూబ తక్తుమీద కూర్చుని అభిషేకానికి సిద్ధంగా ఉంది. అట్టిసమయంలో కాకి ఎక్కడి నుంచో కొట్టుకొని వచ్చి ఒక పక్షిని ఈ ఆర్భాటానికి కారణం అడిగింది. అది విషయమంతా చెప్పింది. అప్పుడు కాకి పక్షులతో ఇలా అన్నది.

'మీరు చాలా మూర్ఖులులా ఉన్నారు. గరుడుని మించి మరెవ్వడూ పక్షిరాజ్యానికి అధిపతి కాలేడు. ఆయన దూరంగా ఉంటే ఏమి? ఆయనపేరు చెప్పుకునే మనం సుఖంగా జీవిస్తున్నాం. మన కష్టాలను ఆయన విష్ణువుకు మనవిచేసి తీరుస్తాడు. గుడ్లగూబను చూస్తేనే భయం! దానికి మనకష్టాలు చెప్పడం సాధ్యం కాదు. దివాంధానికి ఏమి చెప్పినా ప్రయోజనం లేదు. అదేమీ చెయ్యలేదు. మీరు ఈ ప్రయత్నం మానండి' అని చెప్పి కాకి వెళ్లిపోయింది. పక్షులన్నీ చల్లచల్లగా జారిపోయాయి.

సింహాసనంపై కూర్చున్న గూబ, పక్షులన్నీ వెళ్లిపోవడం చూచి నిరుత్సాహంతో తక్తునించి దిగిపోయింది. ఇలా తనకు ఆధిపత్యం రాకపోవడానికి కాకి కారణమని దానికి తెలిసింది. దానికి కాకులమీద విపరీతమైన కోపం వచ్చింది. వాటిపైని విరోధం ప్రకటించింది.

కాకి. గుడ్లకూబలకు విరోధం కలగడానికి ఇదీ కారణం. ●

## అనగనగా...

వేసుకొంది.

'అమ్మా!' అన్నాడు రజని.

'శాంతా!' అని పిలవాడు రామ్మూర్తి.

లక్ష్మి తల్లికాళ్లవద్దకు వచ్చి 'అమ్మా! అమ్మా!' అని పిలిచింది.

శాంత మెల్లిగా కళ్లుతెరచి చూసింది. అంతా మసకమసగ్గా ఉంది. భర్త, రజని మంచానికి చెరోపక్క ఉన్నారు. వారి యిద్దరిమీద చెరోచెయ్యి వేసింది. ఎదురుగా కాళ్లవైపు లక్ష్మి కన్పించింది. 'లక్ష్మి?' అంటూ శాంత యేదో అనబోయింది కాని మాట్లాడలేక పోయింది. ఆమె ప్రాణం అనంతంలో లీనమైపోయింది.

లక్ష్మి, రజని ఒకేసారి 'అమ్మా! అమ్మా!' అంటూ పిలవారు. రామ్మూర్తి 'శాంతా!' అన్నాడు కాని తమ పిలుపులకు యిక సమాధానం రాదని వారు వెంటనే గ్రహించారు.

'అమ్మా! అమ్మా!' అంటూ లక్ష్మి పసిపిల్లలాగ యేడ్చింది.

రజనికి కూడా అంత విచారంగాను ఉంది కాని అతికష్టంమీద అతను తన దుఃఖాన్ని ఆపుకున్నాడు.

రామ్మూర్తి అలాగే కూర్చుండిపోయాడు. 'జీవితంలో కష్టసుఖాలను యింతవరకు తనతోపాటు పంచుకొన్న వ్యక్తి యిక లేదు' అనే భావం అతని మనస్సులో ప్రవేశించగానే, అతను యేమీ మాట్లాడలేకపోయాడు. బొమ్మలాగ అతను ఉండిపోయాడు.

కొంచెంసేపు అయిన తరువాత రజనియే, 'ఊరుకో, లక్ష్మి!' అంటూ లక్ష్మిని ఓదార్చాడు.

'బాబుగారూ! అమ్మకు అంత్యక్రియలు చెయ్యాలి కదా? అన్నయ్యకు కబురు పంపిస్తారా?' అని రామ్మూర్తిని మెల్లగా అడిగాడు రజనీకుమార్.

వెంటనే రామ్మూర్తి 'వద్దు. బాబూ! వద్దు. కబురు పంపించినా, ప్రసాద్ రాడు. ఒకవేళ అతనువచ్చి కర్మచేసినా, మీ అమ్మకు సంతృప్తి ఉండదు. ప్రసాద్‌వల్ల ఆమె చాలా బాధపడింది.

ఆఖరుక్షణంలో 'అమ్మా! అమ్మా!' అంటూ నువ్వే ఆమెదగ్గర ఉన్నావు. నీ చేతుల్లోనే ఆమె సంతోషంగా మరణించింది. అందుచేత నువ్వు కర్మ చేస్తేనే ఆమెకు సంతృప్తి కలుగుతుంది. ఆమె ఉత్తమగతులను పొందుతుంది' అన్నాడు యేమీ తడుముకోకుండా.

రజనీకుమార్ ఆ మాటకు యెదురు చెప్పలేదు. అతనివద్ద డబ్బు ఉంది కాబట్టి కావలసిన యేర్పాట్లన్నీ చకచకా జరిగిపోయాయి రజనీకుమారే యథావిధిగా శాంతకు అంత్యక్రియలు చేశాడు.

(ఇంకా వుంది)




నిండు పౌర్ణమి.

ఆకాశం నిర్మలంగా వుంది. నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి. బీచిలో పరుచుకున్న వెన్నెలకు ఇసుకంతా బంగారంలా వుంది. సాగరంలో కోరికల్లా కెరటాలు ఎగిసెగిసి పడుతున్నాయి. చల్లగా వీస్తున్న గాలి మనసుకి ఉల్లాసకరంగా వుంది.

ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ ఆలోచనా సాగరంలో మునిగిపోయింది వసుంధర.

సహజమైన అందం కల వసుంధర లేతగులాబి రంగు చీరలో ఆరోజు మరీ అందంగా కనిపించింది మురళి కళ్లకి. అమాయకత్వం నిండుకున్న ఆమె ముఖారవిందాన్ని, మంచు బిందువులా మెరిసే ఆమె శరీరచ్ఛాయను, మెల్లగా వీస్తున్నగాలికి మనోహరంగా నుదుట వూగిసలాడుతున్న ఆమె ముంగురులను కన్నార్పకుండ చూస్తున్న మురళికి విసుగనిపించడం లేదు.

'వసూ!' లాలనగా వుంది ఆ పిలుపు.

'ఊఁ' అంది ఆమె మురళికేసి తిరిగి.

'ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? కొత్తగా కథ ఏదైనా మొదలుపెట్టావా? ప్రకృతి పారవశ్యంలో మునిగి పక్కనున్న నన్నే మరిచిపోయినట్టున్నావు!'

ఆమె అందంగా నవ్వింది.

'ఇవాళ ఎందుకో నాకు చాలా ఆనందంగా వుందండీ! ఈ చల్లనిగాలి, పండు వెన్నెల, అలలపై తేలియాడుతున్న ఆ చంద్రహాసం ఇవన్నీ చూస్తుంటే నాకేమనిపిస్తుందో చెప్పనా? ఇక్కడే ఈ బీచి ఒడ్డున ఇల్లు కట్టుకుని, ఎప్పుడూ కథలు రాసుకుంటూ కూర్చోవాలనిపిస్తుంది.'

ఆమె పిచ్చి వూహకు మురళి తనలో నవ్వుకున్నాడు.

'అలా అయితే చచ్చినా బీచిలో ఇల్లు కట్టించను, మరి నువ్వెప్పుడూ కథలు రాసుకుంటూ కూర్చుంటే నా సంగతి ఎవరు పట్టించుకుంటారు?'

'మీకా బెంగేం అక్కర్లేదు. ఒక పని మనిషిని పెట్టుకుందాం లెండి!' అంది గలగలా నవ్వుతూ.

వెన్నెల వెలుగుకి ఆమె పలువరస ముత్యాల్లా మెరిసింది.

'అంతేలే! ఈ కథలు రాసే పిల్లలతో వచ్చే చిక్కే అంత! కథలమీద చూపించే ఆ ధ్యాస కట్టుకున్న మొగుడిమీద వుండదు వీళ్లకి!' కొంటెగా అన్నాడు మురళి.

'ఏమండోయ్ కాబోయే హస్బెండుగారూ! మీరు ఇప్పటినుంచే పెద్దపెద్ద డైలాగులు వాడేస్తున్నారు—ఎవరెలా వుంటారో నాకు తెలీదుగాని నాకుమాత్రం మీ సంతోషం

తర్వాతే ఏదైనా ! తెలుసా !' అంది బుంగ మూతి పెడుతూ.

'ఏదో హాస్యానికన్నాను వసూ నీమనసు నాకు తెలీదా ! ఇవన్నీ చూస్తుంటే నాకేమనిపిస్తుందో చెప్పనా ! తెల్లని చీరలో తలనిండా మల్లెలు తురుముకున్న నిన్ను హృదయానికి చేర్చుకుని, నిర్మలమైన నీ కళ్లలో వెలిగే వింతవింత కాంతుల్ని చూస్తూ... తనివితీరా...!'

'అబ్బ ! ఇక చాలించండి బాబూ! మీ కవిత్వం, నాకు సిగ్గేస్తోంది.' అంది మురళి భుజంమీద తలదాచుకుంటూ. సిగ్గుతో ఆమె బుగ్గలు ఎరుపెక్కాయి.

'వసూ అన్నట్టు, ఇవాళ నీకో శుభవార్త తీసుకొచ్చాను చెప్పనా !'

మురళి కళ్లలో ఆనందం వెల్లివిరుస్తుంది. ఎన్నడూ లేని వుత్సాహమేదో అతనిలో కనిపించింది ఆరోజు.

చెప్పమన్నట్టు వసుంధర కళ్లతోనే సైగ చేసింది.

'నాకు వుద్యోగం దొరికింది వసూ! మొన్న వెళ్లిన ఇంటర్వ్యూలో నేను సెలక్టు అయ్యాను. మనకలలు పండే శుభఘడియలు దగ్గర కాబోతున్నాయి. కాని వసూ ! నాకు దొరికింది సామాన్యమైన గుమాస్తా వుద్యోగం. నా అదృష్టం అంతవరకే పయనించింది. నీవుచూస్తే లక్షాధికారి బిడ్డవి. ఏ లోటూ లేకుండ హాయిగా జీవితం వెలిబుచ్చే నిన్ను ఈ గుమాస్తా గిరితో ఎంతవరకు సుఖపెట్టగలనో అర్థం కావడం లేదు.' అతని కంఠంలో బాధ ధ్వనించింది.

'మురళీ ! నన్ను ప్రేమగా, ఆదరంగా చూసుకుంటే అంతేచాలు అంతకుమించిన ఐశ్వర్యాలేవీ నాకు అక్కర్లేదు. మీ నిర్మలమైన మనసులో నేను సంతోషంగా తలదాచుకోగలను. మీ కష్టసుఖల్లో పాలు పంచుకుని మీ తోడునీడగా నిలువగలిగే ధైర్యం నాకుంది.'

'నీమీద నాకా నమ్మకం వుంది వసూ ! కాని మనపెళ్లికి మీ నాన్నగారు ఒప్పుకుంటారో, లేదో అన్నదే నా అనుమానం. నిన్ను కట్టుబట్టలతోనైనా నాదానిగా పంపితేచాలు అంతకుమించి నేనేమీ ఆశించడం లేదు. నా మనసెందుకో కీడునే శంకిస్తుంది వసూ ! మనపెళ్లి ఏ ఆటంకమూ లేకుండ జరుగుతుం దంటావా ?'

# కులంకానివాడు

సందేహం వెలిబుచ్చాడు మురళి.

'అబ్బ ! ఎందుకండీ మీకీ సందేహం ? మా నాన్నగారు తప్పకుండ మన పెళ్లికి ఒప్పుకుంటారు. ఆ నమ్మకం నాకుంది. నేనంటే నాన్నకు ప్రాణంతో సమానం. పుట్టి పెరిగి ఇంతదాన్నయి ఆయన నోటి నుండి ఇంతవరకు ఏ ఒక్క విషయంలోను కాదు, లేదు అనిపించుకోలేదు. నా సుఖం కోసం నాన్నగారు ఎన్నడూ వెనుకాడరు.' ధైర్యం చెబుతున్నట్టు అంది వసుంధర.

'పిచ్చి వసూ ! రచయిత్రివయి వుండి కూడ నువ్వెందుకంత అమాయకంగా ఆలోచిస్తున్నావో నాకు అర్థం కావడంలేదు. కాసేపు నిజం మాట్లాడుకుందాం.

'మీ నాన్నగారు ఈ పట్టణంలో వున్న పెద్ద వ్యాపారవేత్తలలో ఒకరు ! సంఘంలో ఆయనకు మంచిపేరు, పలుకుబడి, హోదా అన్నీ వున్నాయి. అంతటి శ్రీమంతుడి బిడ్డవు నీవు. ఇక నేను ! ఏరోజుకారోజు పొట్టకూటికోసం ప్రాకులాడే ఒకసామాన్యుడి కొడుకుని. ఏ వేళా విశేషమో మనిద్దర్ని ప్రేమికుల్ని చేసింది. కాని నింగికి నేలకు వున్నంతదూరం వుంది మన మధ్య ఇక మన కులాల సంగతి, అవికూడ వేరే ! మీ నాన్నగారికి కావలసినవి నా మంచిచెడ్డలు, గుణగణాలు కావు. మీ కులంకాని ఒక నిరుపేదనైన నాకు, నిన్ను ఇవ్వడానికి ఆయన సుతరమూ అంగీకరించరు. అలా దూరంగా చూడు ! నింగి నేల కలిసినట్టే అనిపిస్తున్నాయి. కానీ, నిజానికి అవి ఎక్కడా కలియవు.

'వసూ ! నీకు నచ్చిన చీర కొనుక్కుంటానంటే పర్సుదీసి పచ్చనోట్లు ఇవ్వడం, క్రికెట్టు టెస్టు చూడటానికి మద్రాసు వెళ్తానంటే ఎయిర్ టిక్కెట్టు తీసిఇవ్వడం...ఇలాంటి కోరికలు ఎన్నైనా తీర్చగలరు మీ నాన్న కాని, 'నాన్నా ? నేనొక అబ్బాయిని ప్రేమించాను. అతను పేదవాడు. మన కులంవాడు కాదు, అతనితో నా పెళ్లి జరిపించండి' అనే నీ జీవితేచ్ఛను మీ నాన్న తీర్చలేరు వసూ ! జీవితానికి అసలైన అర్థం అప్పుడే కనిపిస్తుంది. చల్లని వెన్నెలను కురిపిస్తున్న ఈ ఆకాశమే ఒక్కోసారి అగ్నివంటి వడగళ్లను కూడ రాలుస్తుంది.' నిజాన్ని చాల సూటిగా చెప్పాడు మురళి.

'మీరు చెప్పింది నిజమే మురళీ ! ఈ ఆలోచన నాకు స్వప్నమాత్రంగానైనా రాలేదు. తొందరలోనే మన విషయం నాన్నగారితో మాట్లాడతాను. ఆయన ఒప్పుకుంటే సరేసరి లేకుంటే అప్పటికీ మీరే అనుకుని ధైర్యంగా మీ వెంట వచ్చేస్తాను' అంది వసుంధర మనస్ఫూర్తిగా.

'ఆ ఒక్క మాట చాలు వసూ! నీ నుండి ఆ సమాధానం కోసమే నేను కూడ ఎదురు చూస్తున్నాను' అంత ధైర్యం నీలో వుంటే నేను నిశ్చింతగా వుండగలను.'

అతని హృదయం తేలిక పడింది. వసుంధరను రెండు చేతులతో దగ్గరకు తీసుకుని మనసారా కౌగిలించుకున్నాడు.

* * *

ఆ రాత్రి భోజనాలయ్యాక తండ్రి గదిలో అడుగు పెట్టింది వసుంధర. ఆ వేళప్పుడు అనంతమూర్తిగారు ఆఫీసు ఫైళ్లు చూస్తూ వుంటారు. సాధారణంగా ఆ గదిలో ఎవరూ అడుగు పెట్టరు. ఎంత అవసరమైనా తప్ప ఆ సమయంలో అతణ్ణి ఎవరూ పలకరించరు. సరిగ్గా భోజనం వేళకు ఆయనే స్వయంగా డైనింగ్ హాలుకి వస్తారు. భార్యాపిల్లలతో నవ్వుతూ, మాట్లాడుతూ భోంచేస్తారు. భోజనం ముగించాక నిద్రపోయే ముందు విధిగా ఆఫీసు కాగితాలని చూసుకుంటారు.

ఏదో ఫైలు తిరగేస్తున్న వాడల్లా కూతురి రాకను చూసి తలెత్తాడు అనంతమూర్తి.

'ఏమ్మా! ఇలా వచ్చావు? ఇంకా నిద్ర పోలేదా?' ఎంతో సౌమ్యంగా వుంది అతని కంఠం.

పెద్దవాళ్ళయిన కూతుళ్లు ఇద్దర్ని పసిపిల్లల్లా చూసుకోవడం అతనికి అలవాటు. అందులో పెద్దకూతురు వసుంధర అంటే అతనికి ప్రాణంతో సమానం. ఆమె ప్రవర్తన మీద అతనికి మంచి నమ్మకం వుంది. ఏనాటికైనా తన వంశమర్యాదను నిలబెడుతుందనే ప్రగాఢ విశ్వాసముంది.

వసుంధరకు తండ్రి అంటే చనువుతో పాటు భయభక్తులు వున్నాయి. అతని మనసు కష్టపడేలా ఆమె ఎన్నడూ ప్రవర్తించలేదు. అతనికి ఇష్టంలేని పని

ఆమె ఏనాడూ చేసి ఎరుగదు. తండ్రి చేత ఆమె ఏ విషయంలోను కాదు, లేదు అని పించుకోలేదు.

ఏది కావాలన్నా ఎంతో చనువుగా అడిగి తీసుకునే వసుంధరకు ఆరోజున తండ్రి ముందు నోరు విప్పడానికి ఎందుకో భయం కలిగింది. తన మనసులో వున్న కోరికను ఎలా చెప్పడమా? అని ఆలోచనలో పడింది. చెబితే ఒప్పుకుంటారో, లేదో అనే సంశయంలో పడింది. టేబిలు మీద వున్న పత్రికను వూరికే అటూ ఇటూ తిరగేస్తూ మౌనంగా వుండిపోయింది.

కూతురి మౌనాన్ని చూసి, 'ఏమ్మా! డబ్బేమైనా అవసరం వచ్చిందా?' యధాలాపంగా నవ్వుతూ అడిగాడు అనంతమూర్తి.

'అందుకు కాదు నాన్నా! మీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలని వచ్చాను.' అంది కొంత ధైర్యం చేసి.

చేతిలో వున్న ఫైలు మూసేసి, 'ఏమిటమ్మా అంత ముఖ్యమైన విషయం? చెప్పు! వింటాను' వినాలని కుతూహలం కనబరుస్తూ అడిగాడు అనంతమూర్తి.

ఉన్న ధైర్యాన్ని అంతటిని కూడగట్టుకుని మురళితో తన ప్రేమ విషయమంతా పూస గుచ్చినట్టు చెప్పింది వసుంధర.

విషయమంతా విన్న అనంతమూర్తి అదిరిపడ్డాడు. వసుంధర అంత తొందర పడుతుందని అతడు కలలో కూడ అనుకోలేదు. అందుకే ఆమె స్వేచ్ఛకు అతడు ఏనాడూ అడ్డు చెప్పలేదు. ఆమె ప్రవర్తనను ఏనాడూ శంకించలేదు. అన్ని విషయాల్లోను తన మాటను గౌరవించే వసుంధర అంతకు తెగిస్తుందని అతడు వూహించలేకపోయాడు. తన చెవులను తానే నమ్మలేక పోయాడు అనంతమూర్తి. అంత వరకు ప్రశాంతంగా వున్న అతని ముఖంలో గంభీరత చోటు చేసుకుంది.

'అమ్మా వసుంధరా! ఎంత తొందర పడ్డావు తల్లీ! నీ కోరిక న్యాయసమ్మతమే అయినా నేను తీర్చలేని అశక్తుడిని. నా ఇబ్బందులేమిటో నీకెలా చెబితే అర్థమవుతుంది?

'ఈ వూరిలో సగానికిపైగా నాకు వంగి సలాములు చేస్తారు. పెద్ద పెద్ద కంపెనీల్లో నాకు షేర్లు వున్నాయి. నలుగురిలో నాకు గౌరవమైన స్థానముంది. మనది నిప్పులాంటి వంశమని బయట పదిమంది చెప్పుకుంటారు. మనల్ని వేలెత్తి చూపడానికి మచ్చుకి ఒక్కడంటే ఒక్కడు ఈ భూమ్మీద ఇంకా పుట్టలేదు. ఇన్నేళ్లుగా నేను కాపాడుకుంటూ వస్తున్న మన వంశమర్యాదలను, నేను గడించిన ఈ కీర్తిప్రతిష్ఠలను ఈనాడు నువ్వు తుడిచిపారేస్తావా తల్లీ! నీవు ప్రేమించిన అబ్బాయి లెవిల్లో కొట్టుకునే సామాన్యమైన వ్యక్తి అంటున్నావు. మన కులం కానివాడు అంటున్నావు. ఎంతటి విషమ పరిస్థితిలో పడేశావమ్మా నన్ను! నీకెలా నచ్చచెప్పాలో నాకు అర్థం కావడంలేదు.

'మీ నాన్న పదిమందిలో గౌరవంగా తల ఎత్తుకుని తిరగాలనే సదుద్దేశమే నీకుంటే నీ అభిప్రాయం మార్చుకోక తప్పదు వసుంధరా! నామాట కాదని నీవు అతనినే పెళ్లాడదలిస్తే ఈ తండ్రిని ప్రాణాలతో చూడలేవు. నీవు రచయిత్రివి. అన్ని మంచి చెడ్డలు నీకు తెలుసు. నీకు నేను వేరే చెప్పాలా అమ్మా!'' అర్థిస్తున్నట్టుగా వుంది అతని కంఠం.

తండ్రి సమాధానం విన్న వసుంధరకు మతిపోయినంత పనయింది. గుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. మూగబోయిన దానిలా ఆమె అలాగే మౌనంగా వుండిపోయింది.

మురళి కళ్ళముందు కదిలి, 'నా మాటల్లో ఎంత నిజముందో ఇప్పుడైనా అర్థమయిందా వసూ!' అని అడుగుతున్నట్టుగా వుంది!

తనను మనస్ఫూర్తిగా ప్రేమించి ఎన్నెన్నో ఆశలు పెంచుకున్నాడు మురళి. తన నిర్ణయాన్ని మార్చుకోమని దీనాతి దీనంగా అర్థిస్తున్నాడు తండ్రి.

వసుంధర ఎటూ నిశ్చయించుకోలేని సందిగ్ధంలో పడింది. ఆమెకు అంతా అయోమయంగా వుంది. మురళిని దూరం చేసుకోవడానికి ఆమె మనస్సాక్షి అంగీకరించడం లేదు. తండ్రిని ఎదిరించేందుకు ధైర్యం చాలటం లేదు. నచ్చ చెప్పేందుకు మాటలు రావడం లేదు. గుండెలు మాత్రం తీవ్రంగా కొట్టుకుంటున్నాయి. పరిస్థితి ఇంత తీవ్ర రూపం దాలుస్తుందని ఆమె కలలోనైనా వూహించలేదు. అంతరాంతరాల్లో అనుభవించే ఆవేదనకు కనుకొలకుల్లో కన్నీరు నిండుకుంది.

కూతురి కళ్ళలో కన్నీరు చూసిన అనంతమూర్తి కొంత కలవర పడ్డాడు.

'అమ్మా వసుంధరా! ఏనాడూ లేనిది ఈ రోజున నీ మనసు నొప్పించాను. ఈ ఒక్క కోరిక తీర్చలేని ఈ తండ్రిని క్షమించు తల్లీ! అతణ్ణి నీవు మరిచిపోక తప్పదమ్మా! మీ బావ శివప్రసాద్ కి నిన్నిచ్చి చేయాలని చిన్నప్పటి నుండి అనుకుంటున్నదే! బావ అన్ని విధాల నీకు తగినవాడు. అతనికి డాక్టరుగా మంచి పేరుంది. అందం, ఐశ్వర్యమూ అన్నీ వున్నాయి. నీకేలోటూ వుండదు. అందులో నువ్వంటే బావకు



రంతో ఇష్టం. శివ నిన్ను సుఖంగా చూసుకుంటాడు. ఆ నమ్మకం నాకుంది తల్లీ! ఈ సంబంధం మీ అమ్మకు కూడ ఇష్టమే' అన్నాడు నచ్చచెప్పే ధోరణిలో.

వసుంధర మరి వినలేక పోయింది.

'వద్దు నాన్నా! నాకసలు పెళ్ళే వద్దు. ఈ జన్మలో నాకు పెళ్ళంటూ జరిగితే అది ఒక్క మురళితోనే జరగాలి లేకుంటే జీవితాంతం నేనిలాగే వుండిపోతాను.'

అంతవరకు అదుపులో పెట్టుకున్న ఆవేశం కట్టలు తెంచుకొని బయట పడింది.

ఏదో చెప్పాలని నోరు తెరిచాడు అనంత మూర్తి. గుమ్మం వద్ద అలికిడి కావడంతో తన ప్రయత్నం మానుకున్నాడు.

అప్పుడే గదిలో అడుగు పెడుతున్న నీరజను చూసి గబగబా కన్నీళ్ళు తుడుచుకుంది వసుంధర. చెల్లెలి ముందు తన దుఃఖాన్ని కనబరచడం ఇష్టం లేక లేచి తన గదికి వెళ్ళిపోయింది.

'ఏమిటి డాడి! అక్కయ్య ఎందుకో ఏడుస్తున్నట్టుంది. వాట్ హేపెండ్ డాడీ!' తండ్రిని అడిగింది నీరజ.

'ఏమీ లేదమ్మా! నువ్వెళ్ళి పడుకో! పొద్దుపోయింది' అని వెంటనే చిన్నకూతుర్ని పంపించేశాడు.

అనుమానం తీరక మళ్ళీ వసుంధర గదికి వెళ్ళింది నీరజ. తలగడలో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ కనిపించింది వసుంధర.

'అక్కా!' అంది వీపుమీద చెయ్యేసి.

'ఏమే ఇలా వచ్చావు? ఇంకా నిద్ర పోలేదా?' అంది పొంగుకొచ్చే దుఃఖాన్ని అదుపులో పెట్టుకుంటూ.

'నువ్వెందుకో బాధపడుతున్నావు. విషయమేమిటో నాకు చెప్పకూడదా?'

వసుంధర ఏ సమాధానమూ చెప్పలేదు.

'మురళి విషయం గాని చెప్పావా ఏమిటి? నాన్నగారితో!' సందేహం పట్టలేక అడిగింది నీరజ.

'అబ్బ నీరజా! నన్ను విసిగించకే! దయచేసి నన్ను ఒంటరిగా వదిలెయ్యి. ప్లీజ్!'

నీరజ మరో మాటలేకుండ తన గదికి వెళ్ళిపోయింది.

* * *

ఉదయం పది దాటినా వసుంధర పడక దిగలేదు.

'వసూ! ఎంత పొద్దెక్కిందో చూడు! లేమ్మా...లే!' తట్టి లేపుతూ అనునయంగా అంది భాగ్యలక్ష్మి.

ఎంతో బలవంతం మీద లేచింది వసుంధర. ఎదురుగా వున్న తల్లిని చూసి, 'అమ్మా'! అని బావురు మంది, పెల్లుబికే దుఃఖాన్ని అదుపులో పెట్టలేక.

'ఊరుకో వసూ! ఉదయం ఆఫీసుకి వెళ్తూ మీ నాన్నగారు అన్ని విషయాలు నాతో చెప్పారు. మీ నాన్న మనసు నీకుమాత్రం తెలీదా? పిచ్చిపిల్లా! ఇంతవరకు ఆయన మీకు ఏ విషయంలో లోపం చేశారు? మీ ఇద్దరిని తన రెండు కన్నుగా చూసుకొంటున్నారు. నీ విషయం విన్న దగ్గరనుండి ఒక కంటిలో ముళ్ళు దిగబడినంతలా బాధపడిపోతున్నారు. మేము ఏది చేసినా అది మీ మంచికోరేనమ్మా! నీకెలా నచ్చచెప్పాలో నాకు అర్థం కావడం లేదు. నీ అభిప్రాయం మార్చుకోక తప్పదు వసూ! లేకుంటే పరువు ప్రతిష్ట అంటూ ఆయన ఏ అఘాయిత్యానికైనా పూనుకుంటారు. నీ మూలంగా అందరి జీవితాలూ నాశనమవుతాయి. అది నీ కిష్టమేనా? చెప్పు వసూ! అందరి మంచిని కోరేదానివయితే ఆ అబ్బాయిని నీవు శాశ్వతంగా మరిచిపోవాలి వసూ!'

'నీవు కూడ అమాటే అంటున్నావా అమ్మా!' బేలగా అంది వసుంధర.

'వసూ! అన్నీ తెలిసివుండి ఎందుకంత అమాయకంగా ప్రవర్తిస్తున్నావో అర్థం కావడంలేదు. మీ నాన్నగారి పరువు ప్రతిష్టల మాట అటుంచు. నీరజ సంగతి ఆలోచించావా? మా మాట కాదని ఒకవేళ నువ్వు అతనినే చేసుకుంటే దాని పరిణామం ఎంత తీవ్రంగా వుంటుందో తెలుసా! ఒక కులం కానివాడితో లేచిపోయిన దాని చెల్లెలని నీరజ గురించి - ఈ లోకం తేలికగా మాట్లాడుతుంది. నీ స్వార్థం నీరజ జీవితాన్ని ఒక అగ్నిపరీక్షకు నిలబెడుతుంది. ఏ పాపము ఎరుగని దాని బ్రతుకు బజార్న పడుతుంది. అభిమానమున్న వాడెవడూ దానిని కట్టుకోవడానికి ముందుకి రాడు. అప్పుడు దాని పెళ్ళి ఒక పెద్ద సమస్యగా తయారవుతుంది. అది కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ వుంటే నువ్వు సుఖపడగలవా? తొందరపడకుండా ఆలోచించు వసూ!

'నీరజ అశుభము శుభము ఎరగని పిల్ల. దాని పెళ్ళి సవ్యంగా జరిగి అది ఒక ఇంటిది కావాలని నీవు మనసారా కోరుతున్నట్టయితే ఈ త్యాగం చెయ్యక తప్పదు!

'మీ నాన్నగారు ఇచ్చిన మాటను నిలబెట్టడానికి నువ్వు బావను చేసుకుంటే ఏ సమస్యలూ వుండవు. చిన్నప్పటినుండి నీ మీద మీ నాన్నగారు పెంచుకున్న ఆశల్ని నిలబెట్టడం నీ ధర్మం. అంతకుమించి నేనేమీ చెప్పలేను' నిజాన్ని ఎంత సూటిగా చెప్పిందో అంత నేర్పుగానూ చెప్పింది భాగ్యలక్ష్మి.

వసుంధర మౌనంగా ఆలోచించడం మొదలుపెట్టింది. ఆమెలో ఒక్కసారిగా అనేకమైన ప్రశ్నలు తల ఎత్తాయి.

ధైర్యంచేసి తను మురళిని చేసుకుంటే నీరజ గతి ఏమౌతుంది? అమ్మ చెప్పినట్టు దానిని ఎవరు చేసుకుంటారు? తన స్వార్థం కోసం ఒక అమాయకురాలి జీవితంలో నిప్పులుపోసి వెళ్ళిపోవడమా? తన తోడ బుట్టిన చెల్లెలు కుళ్ళి కుళ్ళి ఏడుస్తుంటే తను సుఖంగా బ్రతకగలదా?

ఎన్నటికీ అలా జరగడానికి వీల్లేదు. తన మూలంగా నీరజ జీవితం నాశనం కాకూడదు' తన కళ్లలో కన్నీరు నింపుకొనైనా మరొకరి కళ్లలో ఆనందం నింపాలి. తను ఈ త్యాగం చెయ్యక తప్పదు!' వసుంధరలో ఏదో తెగువ చోటు చేసుకుంది.

'త్యాగం అనే పదంతో నా మనసుని ముక్కలు చేసేశారు మురళీ! నా మాట నిలుపుకోలేకపోయాను. నన్ను క్షమించు మురళీ!' ఏ మూలనుండో ఘోషించింది ఆమె అంతరాత్మ!

* * *

వసుంధర వివాహం వైభవంగానే జరిగింది.

కలలుగన్న మురళితో కాకుండ జీవచ్ఛవంలా అన్నిటికీ తలవొగ్గి డాక్టరు శివ ప్రసాద్ సతీమణి అయింది.

పెళ్ళయిన నెలరోజులకి భర్తతో హైదరాబాదు వెళ్ళిపోక తప్పలేదు వసుంధరకి.

సంఘంలో ఐశ్వర్యవంతులైనవారికి వుండవలసిన పేరు, వృత్తి రీత్యా మంచి

వెలుకుబడివున్న శివప్రసాద్ నిజస్వరూపం తెలుసుకోవడానికి ఎన్నోరోజులు పట్టలేదు వసుంధరకి.

లోకంలో అతడు అన్నిటికన్నా ఎక్కువ విలువనిచ్చేది డబ్బుకి. మనిషి ప్రాణాలు పోయినా చూస్తాడు తప్ప డబ్బులేనిదే చూడడు. ఇంటికి తాగకుండ రాని రోజంటూ వుండదు. అదేమిటంటే పొస్టిటీలో పెద్దమనిషిగా చెలామణి కావాలనే ప్రతి ఒక్కడూ తాగితీరాలంటాడు. క్లబ్బుల్లో పేకాడడం, గుర్రాలమీద రేసు కట్టడం... ఇలాంటి వ్యసనాలు అతనిలో

విన్నో వున్నాయి. అతని దురలవాట్లను దూరం చెయ్యాలని వసుంధరచేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు.

పెళ్ళికిముందు వసుంధర ప్రేమ విషయం కొంత తెలిసిన శివప్రసాద్ ఆమెను ప్రేమగా, ఆదరంగా చూడలేక పోయాడు. భార్యతో ఒక్కనాడు కూడ అతడు మనసు విప్పి మాట్లాడలేదు. ఆమెను అర్థం చేసుకోవడానికి అతడు ఏనాడూ ప్రయత్నించలేదు. భర్తపట్ల వసుంధర ఎంత అణకువగా ప్రవర్తించినా, ఎంత జాగ్రత్తగా నడుచుకున్నా ఏవేవో లోపాలు ఎత్తిచూపేవాడు. ఆమె పట్ల అతడు విరసంగానే మెలిగేవాడు. అర్థంలేని అనుమానాలతో అనుక్షణం ఆమెను మానసిక హింసకు గురిచేసేవాడు. సుఖశాంతులనేవి ఆమెకు దూరం చేశాడు.

అతడు విద్యావంతుడు. తెలివైనవాడు. కాని వాటన్నిటికి మించిన సంస్కారం మాత్రం అతనిలో లోపించింది.

తన బాధల్ని తాత్కాలికంగానైనా మరిచిపోవడానికి వసుంధర తన మనసుని కథలు రాయడంలో నిమగ్నం చేసేది. రచన అంటే ఆమెకు చిన్నప్పటి నుండి అభిరుచి. రచయిత్రిగా ఆమె పాఠకుల్లో మంచిపేరు సంపాయించుకుంది. అభిమానులు కొందరు ఆమె రచనల్ని ప్రశంసిస్తూ ఉత్తరాలు రాసేవారు. కొందరయితే ముఖతః కలుసుకుని మాట్లాడాలనే కోరికతో ఇంటికి వచ్చేవారు. అవన్నీ నేరాలుగా పరిగణించేవాడు శివప్రసాద్. సంకుచిత స్వభావుడైన భర్తకు నచ్చచెప్పలేక తన రచనా ప్రవాహానికి కూడ

# కులంకానివాడు

ఆనకట్ట వేసింది వసుంధర.

శివప్రసాద్‌తో తన వివాహం జరిగినందుకు తన తల్లిదండ్రులు ఎంతగానో సంతోషించారు. తనను అన్నివిధాల సుఖంగా చూసుకుంటాడని ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. అతని ప్రవర్తన వాటన్నిటికి భిన్నంగా వుందని తెలిస్తే కన్నకడుపులు మలమలా మాడిపోతాయి. తన జీవితంలో దొరికే ప్రతి సంఘటనా గాని కన్నవాళ్ళ గుండెలు పగిలి చచ్చిపోతారు.

గుండెల్ని దొలిచివేసే ఆవేదనకు తను చిక్కి శల్యమయింది. బాధలన్నిటినీ మొండిగా భరించడం నేర్చుకుంది. తను ఈ జీవితంలో సుఖపడుతుందనే ఆశ ఏనాడో వదులుకుంది. తన బాధల్ని వినిపించి తనవాళ్ళనికూడ తనతోపాటు బాధపెట్టడం ఆమెకు ఇష్టం లేకపోయింది. తనవాళ్ళను సంతృప్తిపరచడం కోసం తన దాంపత్య జీవితం మూడుపువ్వులు — ఆరుకాయలుగా గడిచిపోతుందని తనవాళ్ళకు ఉత్తరాలు రాసేది.

తన త్యాగం తనను ఎంతవరకు తీసుకవెళుతుందో చూడాలి?

*  *  *

కొండంత ఆశతో కూతుర్ని తీసుకు వెళ్ళాలని వచ్చిన అనంతమూర్తి వసుంధరను ఆ దీనావస్థలో చూసి నెత్తి నోరు బాదుకున్నాడు. కళకళ లాడుతూ మహాలక్ష్మిలా వుండవలసిన తన బిడ్డ ముఖంలో గూడుకట్టుకున్న విషాదచ్ఛాయల్ని చూసి కంట తడిపెట్టుకున్నాడు.

'ఏమిటమ్మా వసుంధరా! ఇలా అయిపోయావ్?' దుఃఖం కూడుకున్న కంఠంతో అడిగాడు.

'మీరు వచ్చేముందు నీరసం వచ్చింది. అంతే నాన్నా! మరేం లేదు' అంది నవ్వించడానికి ప్రయత్నిస్తూ! అదుపులో పెట్టుకున్న కన్నీరు కళ్ళలో సుళ్ళు తిరిగింది.

'నువ్వేదో దాస్తున్నావని నీ కళ్ళే చెబుతున్నాయి. బావ నిన్ను సుఖంగా చూడటం లేదా? చెప్పు తల్లీ! నాదగ్గర నీకు దాపరికమెందుకమ్మా!'

'అలాంటిదేమీ లేదు నాన్నా! నాలుగు రోజులు నీరసం చేసింది. అంతే! అమ్మా, చెల్లి బావున్నారా నాన్నా!' అంది మాట మారుస్తూ.

బయట కారు ఆగిన చప్పుడయింది. తాగుడు మైకంలో వున్న శివప్రసాద్ ఊగుతూ తూగుతూ ఇంట్లో అడుగు పెట్టాడు. ఏ రహస్యమయితే తండ్రి ముందు కప్పిపుచ్చడానికి ప్రయత్నించిందో అది కాస్తా వెల్లడయింది.

భర్తను సముదాయించి లోపలికి తీసుకు వెళదామని వచ్చిన వసుంధరను బలవంతంగా విదిలించేసరికి ఆమె దూరాన పడిపోయింది.

అల్లుడి ప్రవర్తన కళ్ళచూసిన అనంతమూర్తి, 'శివా!' అని ఇల్లు దద్దరిల్లేలా కేకపెట్టాడు.

'ఎవరూ? మామయ్యలా వుందే! ఏమిటీ అకాల ప్రయాణం? అమ్మాయిని తీసుకపోవడానికి వచ్చారా? వెరీగుడ్! మా ఆవిడ గారంటే మీకా వుండాలి. నా మనసులో









ప్రశ్నేశాన్ని ఎలా కనిపెట్టేశారు మామ గారూ! మీ అమ్మాయి పద్ధతేం నచ్చలేదు. తీసుకుపొండి. నేనే పంపించెయ్యాలనుకుంటున్నాను. మీరే వచ్చేశారు. థాంక్యూ!' బాగుడుమ్మైకంలో నోటికొచ్చింది వాగి తన గదికి వెళ్ళిపోయాడు శివప్రసాద్.

తన కళ్ళముందు పెరిగి పెద్దవాడయిన శివప్రసాద్‌లో అంత మార్పు ఎలా వచ్చిందో అర్థంకాలేదు అనంతమూర్తికి. మార్పు అనేది మనిషిలో ఇంత త్వరగా వస్తుందో శివప్రసాద్‌ని చూసి మొదటిసారి తెలుసుకున్నాడు.

'ఎంత పొరపాటు చేశాను తల్లి!' అన్నాడు కూతుర్ని దగ్గరకు తీసుకుని.

'పొరపాటెందుకయింది నాన్నా! నేను బాగుపడాలనేగా నాకీ పెళ్ళి చేశావు బావ మంచి కులంవాడు పెద్ద ఆక్టరు. అంద గాడు బోలెడంత ఆస్తి వుంది. నన్ను ఎంత సుఖంగా చూసుకుంటున్నాడో చూశావా నాన్నా?' అంది వసుంధర జీవం లేని నవ్వు పెదాలమీద తెచ్చిపెట్టుకుంటూ.

తను చేసిన తప్పేమిటో అప్పటికి గాని తెలిసి రాలేదు అనంతమూర్తికి. కూతురుకి ఏ సమాధానము చెప్పలేక తల దించు కున్నాడు.

పరువు ప్రతిష్ఠ అంటూ తన కూతురి నూరేళ్ళ జీవితంలో నిప్పులుపోసిన స్వార్థ పరుడు తను. తన పరువు ప్రతిష్ఠలను నిల బెట్టుకోడం కోసం తన కూతురు నిండుజీవి తాన్నే నాశనం చేసుకుంది. ఆ కూతురి కన్నీళ్ళు తుడిచి, ఆమె కాపురం చక్క దిద్దడం కోసం ఈరోజు తనేం చెయ్య గలడు?

బాధతో తను కన్నీళ్ళు కార్చడం తప్ప తన కూతురి కంటతడిమాత్రం తుడవ లేదు. అంతా చెయ్యి దాటిపోయింది. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభ మేమిటి?

ఆ మరునాడు ఉదయం అల్లుడిని మంచికేడ్డా అడిగాడు. అన్నిటికి నింపనగానే సమాధానా లిచ్చాడు శివప్రసాద్ అతనికి ఎన్నోవిధాల నచ్చచెప్పాడు అనంతమూర్తి. అన్యాయకుడొల్లన్న తన కూతురి జీవితం నరకం చెయ్యొద్దని బతిమాలాడు ఇకి మీదట దాని జీవితానికి సుఖశాంతులు ప్రసాదించమని చేతులు పట్టుకుని ప్రాధేయ పడ్డాడు. మామగారి చేతుల్లో వున్న తన చేతుల్ని బలవంతంగా విదిలించి పారేశాడు శివప్రసాద్.

ఆ బాధనంతా ఒకవైపు భరిస్తూ, 'బాబూ శివా! నీరజకు పెళ్ళి నిశ్చయ మయింది. ముహూర్తం వచ్చేనెలలోనే! నిన్నూ అమ్మాయిని తీసుకవెళదామని వచ్చాను' అన్నాడు బతిమాలుతున్న ధోరణిలో.

'నేను రావడానికి వీలుపడదు. నాకు అర్జంటుకేసులున్నాయి' అన్నాడు ముక్త సరిగా.

మరోసారి బతిమాలేందుకు అవకాశం లేనంత నిరసన వుంది ఆ సమాధానంలో.

'పోనీ అమ్మాయినైనా పంపించు బాబూ!' అన్నాడు సగం చచ్చిన ఆశతో.

'మీ ఇష్టం!' అని చెప్పి వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

గుమ్మంలో అడుగు పెట్టిన వసుంధరను ఆప్యాయంగా వెళ్ళి కావలించుకుంది నీరజ. ఎప్పుడూ నవ్వు ముఖంతో వుండే వసుంధరకు చిక్కి శల్యమై శోకమూర్తిలా తయారయిన ఇప్పటి వసుంధరకు ఎంతో తేడా వుంది. వసుంధరను ఆ దీనావస్థలో చూసిన నీరజ కళ్ళు చెమర్చాయి.

'ఏమిటే ఇలా అయిపోయావ్?' అంది గాద్గదికంగా.

'నాకేమే బాగానే వున్నాను' అంది వసుంధర నవ్వడానికి ప్రయత్నిస్తూ!

'ఒక్కదానివే వచ్చావేం! బావ రాలేదా?' అంది నీరజ అంతలోనే ప్రసంగం మారుస్తూ.

'వారికేవో అర్జంటు కేసులున్నాయట. ముహూర్తానికల్లా వస్తానన్నారు.'

ఏడాది గడిచిన తర్వాత ఇంట్లో అడుగు పెట్టిన కూతుర్ని ఆ స్థితిలో చూసిన భాగ్యలక్ష్మికి కడుపులో దేవినట్టయింది. దుఃఖం దిగమింగుకోలేక గొల్లుమంది

# కులంకానివాడు

కూతుర్ని దగ్గరకు తీసుకుని.

వసుంధర మనసు ఏ నాడో రాయి చేసుకుంది. అంతరాంతరాల్లో తను అనుభవించే బాధను పైకి కనబడనీయకుండ అందరితో మునుపటి వసుధరలాగే మెలిగింది. పెదాల వెనుక శాశ్వతంగా అయిపోయిన చిరునవ్వుని వెలికి తియ్యాలని ఎంతగానో ప్రయాస పడింది.

వసుంధర వచ్చాక ఒక్క క్షణం కూడ విడిచిపెట్టలేదు నీరజ. షాపింగులకని, సినిమాలకని, బీచికని పెళ్ళి ముందు నెల రోజులు అక్కతో సరదాగా గడిపింది. తాత్కాలికంగానైనా అక్క మనసులోని బాధల్ని దూరం చెయ్యాలని ప్రయత్నించింది.

పెళ్ళికి ఇంకా మూడు రోజులుంది. ఆ రాత్రి అందరూ కలిసి సరదాగా భోజనాలు చేశారు. పడుకోవడానికి యథాలాపంగా తన గదికి వెళ్తున్న వసుంధరను ఆపి, 'అక్కా! ఈవేళ నాతో కలిసి పడుకోవాలి ఈ అవకాశం మళ్ళీ కలుగుతుందో లేదో!' అని తన గదికి తీసుకొని వెళ్ళిపోయింది నీరజ.

ఆ రాత్రంతా నీరజ పిచ్చి పిచ్చిగా ఏదో మాట్లాడింది. చిన్నప్పుడు ఇద్దరూ కలిసి చేసిన అల్లరి, పెద్దయ్యాక చేసిన చిలిపి పనులు, అమ్మతో పోట్లాడి అలిగి నాన్నతో బతిమాలించుకోవడం, పరికిణీ వోణీలు వేసుకుని కాలేజికి వెళ్ళడం, అధ్యాపకులను ఆట పట్టించడం... అలా ఒక్కొక్క విషయమే జ్ఞప్తికి తెచ్చి పడిపడి నవ్వింది.

అప్పటికే రాత్రి రెండు కావడంతో, 'నీరజా! ఇక ఆపవే తల్లీ! నీ పిచ్చినాగుడు. అత్తవారింటికి వెళ్ళాక ఈ అక్కను కనిపించడం మానేస్తావా ఏం? పడుకో' అని చెప్పి వసుంధర నిద్రలోకి జారిపోయింది.

మళ్ళా ఉదయం ఆరింటికి గాని తెలివి రాలేదు వసుంధరకు నిద్ర లేవాక పక్క మీద నీరజ లేకపోవడం చూసి, తనకన్నా ముందే లేచి వుంటుందని అనుకుంది. కాని ఆమె తలగడ దగ్గర కనిపించిన వుత్తరాన్ని చూసిన మీదట ఆమెను భయం ఆవహించింది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టాయి. ఉత్తరం మడత విప్పుతున్న ఆమె చేతులు సన్నగా వణికాయి.

అక్కా!

ఈ పెళ్ళి నాకు ఏ మాత్రమూ ఇష్టం లేదు. నా నిర్ణయం అమ్మా నాన్నకు చెప్పినా అర్థం చేసుకుంటారనే నమ్మకం నాకు లేదు. అందుకే నా దారి నేను చూసుకుని వెళ్ళిపోతున్నాను. కన్నబిడ్డల సుఖం కన్నా వంశమర్యాదలు, పరువు ప్రతిష్ఠలే నాన్నకు ఎక్కువ! లోకంలో సుఖమంతా డబ్బుతోనే వుందనుకుంటాడు పిచ్చినాన్న కానీ డబ్బు కొనలేని సుఖాలు కూడ లోకంలో చాలా వుంటాయని తెలిసి అమాయకుడు నాన్న! అలాంటి వారిని మార్చడం మనతరం కాదు. కాలమే మార్చాలి.

ఒకరి స్వార్థం కోసం నేను ఆత్మ వంచన చేసుకోలేను. మనిషిగా పుట్టింది జీవచ్ఛవంలా బ్రతకడానికి కాదు. ఎదురు వచ్చిన సుఖాలను వదిలించుకుని అర్థంలేని త్యాగాలతో కష్టాలను కొని తెచ్చుకోవడం పిరికివాళ్ళ లక్షణం. అర్థంలేని త్యాగంతో నా జీవితాన్ని చేజేతులా బలిచేసుకోలేను. నిప్పు అని తెలిసి ముట్టుకునేటంత అవివేకులు ఎవరూ వుండరు. బతకడం చేతకాని నీ వంటి అమాయకులు ఎవరో తప్ప!

మురళిని అంత ప్రాణపదంగా ప్రేమిం



కేంద్ర పెట్రోలియం, రసాయనిక శాఖామంత్రి శ్రీ హెచ్. ఆర్. గోఖలే ఆధ్వర్యాన హిందీ చలన చిత్ర పరిశ్రమ తరఫున శ్రీయుతులు జి. పి. సిప్పీ, బి. ఆర్. చోప్రా, దిలీప్‌కుమార్, కరణ్ దివాన్, సుధీర్ సేన్, కుమారి లతామంగేష్కర్ మొదలగువారు డిసెంబరు 21 వ తేదీన శ్రీమతి ఇందిరా గాంధీని కలుసుకుని 'ప్రధాని సహాయనిధి'కి 14 లక్షల రూపాయలు అందజేశారు.

చిన నువ్వెందుకు అతణ్ణి పెళ్ళి చేసుకోలేదో నాకు అర్థంకాలేదు. అంత ధైర్యం చెయ్యలేని దానివి ఎందుకు ప్రేమించావు? మనసు రాయిచేసుకుని, అన్నీ మరిచి నువ్వు బతికేస్తున్నావు. అది అందరికీ సాధ్యమనుకున్నావా? మురళి ఆ తర్వాత ఏమయ్యాడో నీకేమైనా తెలుసా అక్కా! నిన్ను మనసారా ప్రేమించిన మురళిని నువ్వే తిరస్కరించేసరికి అతనికి లోకంమీదే నమ్మకం పోయింది. అందుకే ఈ లోకంనుండి శాశ్వతంగా వీడ్కోలు తీసుకున్నాడు. నీ స్వార్థం ఒక నిండుప్రాణాన్ని బలిగొంది అక్కా!

అన్నీ తెలిసిన ఒక పెద్ద రచయిత్రివయి వుండి కూడ నువ్వెందుకంత అవివేకంగా ప్రవర్తించావో నాకు అర్థం కాలేదు. నీ చదువు సంస్కారం ఏ గంగలో కలిపేశావు? నీ రచనల గారడీతో కాఫీ కప్పులు కడిగే వాడిని కలక్టరు చెయ్యగలవు! వితంతువులకు పునర్వివాహాలు చెయ్యగలవు! కోటీశ్వరుడి కూతురికి రిక్షావాడి కొడుక్కి రిజస్టరు మేరేజిలు చెయ్యగలవు! కాని నిజ జీవితంలో నువ్వు చేసిందేమిటి? నీవు వర్ణించే ధర్మసూత్రాలు, చూపించే ఆదర్శ మార్గాలు నీవే అనుసరించలేనప్పుడు మరొకరికి చెప్పడంలో ప్రయోజనం ఏమిటి? నీ కల్పిత గాథలకు నీ యదార్థ జీవితానికి మధ్య ఎంత పెద్ద అగాధముందో తెలిసిందా!

కాలం మారింది అక్కా! దానితోబాటు మనుషులు కూడ మారారు. ఈనాడు కులాంతర, మతాంతర వివాహాలు అతి సామాన్యమైపోయాయి. మనిషిని మనిషిగా గౌరవించడం నేర్చుకుంటుంది సమాజం. కులాలు, మతాలు అనేవి ఈ లోకంలో మనిషి జన్మ ఎత్తాకే వచ్చాయని నీకు తెలీదా! మనలాంటి వాళ్లంతా ధైర్యం చేస్తేనే ఈ సమాజంలో ఇంకా మార్పు వచ్చేది. మనిషికి మనిషికి మధ్య వున్న ఈ దూరాలు దగ్గరయేది కేవలం నీలాంటి వాళ్ల రాతలవల్ల కాదు.

అమ్మా నాన్న ఏరికోరి నిన్నో పెద్ద డాక్టరు చేశారు. మన కులంవాడు ధనవంతుడు. స్వయంగా బావ! అతనివలన నీవు పొందిన సుఖం ఏమిటి? నువ్వు దాచాలని ప్రయత్నించినా దాగని కన్నీళ్ళేనా!

తెలిసి తెలిసి నేను కూడ అదే నరక కూపంలో ఇరుక్కోలేను. అందుకే నా బతుకేదో నేను చూసుకుంటున్నాను. నా మనస్సాక్షి చెప్పినట్లు నేను నడుచుకుంటున్నాను. నేను ఒకతణ్ణి ప్రేమించాను. అతనిది మన కులం కాదు. మన మతస్తుడు కాదు. డబ్బున్నవాడు అసలేకాదు. మరేమిటి చూసి ప్రేమించావని అడుగుతావేమో! అతనికి చదువుంది. సంస్కారముంది. నా ఆదర్శాలను గౌరవించే విశాలమైన హృదయముంది. తనదంటూ ఆయనకో వ్యక్తిత్వం వుంది. మగవాడికి అంతకుమించిన అర్హతలు ఇంకేం కావాలి? నమ్ముకున్న అతనితోనే నా జీవితాన్ని శాశ్వతంగా ముడిపెడుతున్నాను. భావి జీవితంలో నాకు కష్టాలే ఎదురయినా నేను బాధపడను.

అమ్మా నాన్న నా విషయం విని ఏదో అయిపోతారని భయపడుతున్నావా! అది కేవలం భ్రమ! ఒకరోజో రెండురోజులో బాధపడతారు. కాలం గడిచే కొద్దీ నా తలంపు కూడా వారికి దూరమవుతుంది. ఇక నాన్నగారి పరువుప్రతిష్ఠల సంగతి! అవి ఎక్కడికీ పోవు. యంత్రాలు

హోమాలుగానే తిరుగుతాయి. వచ్చే లాభాలు వస్తూనే వుంటాయి. డబ్బున్న వాళ్ళదగ్గ పరువుప్రతిష్ఠలకి ఏ కొదవా వుండదు వాళ్ళు పరువు ప్రతిష్ఠల్ని డబ్బుతో కొననూ గలరు. అమ్మనూ గలరు! నిజం రాసినందుకు బాధపడకు.

మా భవిష్యత్తును పూలబాట చేసుకోవాలనే సదుద్దేశంతోనే మీ అందరికి దూరమవుతున్నాను. ఈ చెల్లి ఎక్కడున్నా నిన్ను మాత్రం మరిచిపోదు ప్రాప్తముంటే మళ్ళీ కలుస్తాను.

నీరజ!

ఉత్తరం పూర్తిచేసిన వసుంధర కళ్లలో నీరు సుళ్ళు తిరిగింది. ఆ కన్నీటి పొరల వెనుక దాచిన గతం, ఆ గతంలోని ఒక్కొక్క సంఘటన సృష్టికిరణాలమాదిరి జాలిగా తట్టి వెక్కిరించాయి.

వసుంధర చేతిలోని ఉత్తరంలో కొన్ని అక్షరాలు ఆమె కన్నీటికి జాలిగా కరిగిపోయాయి. మరికొన్ని అక్షరాలు హేళనగా నవ్వుకున్నట్టు కనిపించాయి.

'నీరజ అశుభము శుభము విరుగనిపిల్ల.' దాని పెళ్లి సవ్యంగా జరిగి అది ఒక ఇంటిది కావాలని నీవు మనసారా కోరుకున్నట్టయితే ఈ త్యాగం వెయ్యక తప్పదు!' ఆరోజు తల్లి అన్నమాటలు జ్ఞప్తికి వచ్చాయి.

వసుంధరలోని ఆలోచనా స్రవంతి కట్టలు తెంచుకుంది.

'త్యాగం—స్వార్థం!' తను రచయిత్రి. ఆ మాటలకు అర్థాలు తనకు బాగా తెలుసు! తను ఒక కులం కాని వాడిని చేసుకుంటే తన తండ్రి పరువుప్రతిష్ఠలు బజార్న పడతాయని, తనవాళ్లు సమాజం ఇనుప పాదాల కింద నలిగిపోతారని ... కన్నవారి కన్నీళ్లు చూడలేక, తన తోడబుట్టిన దాని బతుకు సవ్యంగా వుండాలని తనలో పరవళ్లు తొక్కే కోరికల్ని సమాధిచేసి, తన



# కులంకానివాడు

కులం కాని వాడనే నెపంతో తనను నమ్ముకున్న మురళిని దూరంచేసుకని, ఇష్టం లేకపోయినా తన కులంవాడితో మూడు ముళ్లూ వేయించుకుని ... జీవితం కూడ కథలాంటిదేనని, వెచ్చటి కన్నీటికి అర్థం త్యాగమని కూడబలుక్కుంది.

తన స్వార్థానికి సానుభూతిలేని పాత్రగా మురళి ఆహుతి అయిపోయాడు. కానీ, తన త్యాగానికి?...

ఎవరి సుఖంకోరి తన నూరేళ్ల జీవితాన్ని నాశనం చేసుకుందో, ఎవరి క్షేమం కోరి తన మనసును రాయి చేసుకుందో, ఎవరి బతుకును సవ్యంగా చూడాలని తన కులం కానివాడనే నెపంతో తనమీద ఆశలు పెట్టుకున్న మురళిని దూరం చేసుకుందో .. ఆ నీరజే ఈరోజు ఒక కులం కానివాడికి మనసిచ్చి ఎవరినీ లెక్కచెయ్యకుండ ధైర్యంగా రెక్కలు విప్పుకుని ఎగిరిపోయింది. తన త్యాగానికి ఫలితమైనా దక్కనీయకుండ జీవితాంతం కుళ్లికుళ్లి ఏడ్వమని వెళ్లిపోయింది.

రేపు పొద్దుట నీరజ గురించి అందరూ నానావిధాల మాట్లాడుకుంటారు. కన్నవాళ్ళు పరువుపోయిందని బాధపడతారు. దూషిస్తారు. శపిస్తారు! కాని ఎన్నాళ్ళు?...

కాలచక్రం ఆగదు. అది ముందుకు తిరిగేకొద్దీ నీరజ స్మృతులు వెనక్కి మళ్లిపోతాయి. కొన్నాళ్లకు నీరజను అంతా మరిచిపోతారు. ఏవరిమాటలు నీరజకు వినిపించవు. ఎవరికోపాలు నీరజ చూడదు. మనసిచ్చిన తనవాడితో మధురస్వప్నాలు కంటూ, వెలుగురేకలతో జీవితాన్ని తీర్చి దిద్దుకుంటుంది.

కానీ, తను?...

ఊహించేందుకు ధైర్యం చాలక కుప్పగా కిందికి ఒరిగిపోయింది వసుంధర! ●



# ముగ్గురుమహారాణులు

(11 వ పేజీ తరువాయి)

'దాని విలువ పదిలక్షల వరహాలు' అని వర్తకుడు చెప్పగానే పెద్దరాణి కొనడానికి సందేహించింది. 'మిగిలిన రాణులు యేమంటారో' అని ఆమె తనలో అనుకొంది.

వర్తకుడు అప్పుడు 'అమ్మా! మీరు యిప్పుడు డబ్బు నాకు యివ్వనక్కరలేదు. నేను యిప్పుడు వర్తకంమీద దూరదేశం వెళుతున్నాను. నేను తిరిగి వచ్చేసరికి అయిదారు సంవత్సరాలు పట్టవచ్చును అప్పుడు మీరు డబ్బుయిస్తే చాలును' అన్నాడు.

ఒక ముసలిదాసి అప్పుడు రహస్యంగా రాణితో యిలాగ అంది.

'ఈ అయిదారు సంవత్సరాల కాలంలో వర్తకుడే చనిపోవచ్చును. లేదా దేశకాల పరిస్థితులు మారిపోవచ్చును. ఆ పరిస్థితిలో నువ్వు డబ్బు యివ్వవలసిన అవసరమే ఉండదు. లేదా ఉత్తుంగభుజ మహారాజా చనిపోయి, నందుడే రాజు కాగలడు. అప్పుడు నందుడే ఆ డబ్బు యిచ్చివేస్తాడు. అయిదారు సంవత్సరాలపోయిన తరువాత యివ్వవలసిన బాకీకి భయపడి యిప్పుడు రత్నహారం కొనకపోవడం తెలివితక్కువతనం' అని ఆ దాసి పెద్దరాణికి బోధించింది.

'ప్రస్తుతావసరం తీరిపోతే చాలును. తరువాత యేం జరుగుతుందో' అని చెప్పడానికి 'నందోరాజా భవిష్యతి' అనే సామెత అప్పటి నుంచీ వాడుకలోనికి వచ్చింది' అన్నాడు చూడామణి.

'ముల్కీ నిబంధనల గడువుకూ ఆ సామెతకూ సంబంధం యేమిటి?' అని అడిగాడు చంద్రరావు.

'ముల్కీ నిబంధనల గడువు తీరిపోయిన తరువాత తిరిగి గడువు పొడిగించడం జరగదని ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ చెప్పింది కాని అప్పటివరకూ ఇందిరాగాంధీనే ప్రధానమంత్రిణిగా ఉంటుందనే హామీ యేముంటుంది? ఈలోపున యెన్ని మార్పులు వస్తాయో?

గడువు తీరిపోయిన తరువాత యింకా కొంతకాలంపాటు ముల్కీ నిబంధనలు

(64వ పేజీ చూడండి)

పురుషుడు
ఎప్పుడూ మహారాజే.
అతని మగువ
అతనికి మహారాణి.
వారి పాప ఆనందరాశి.

కుటుంబంలోగల
అనేక ప్రవృత్తులే
మఫత్‌లాల్
బట్టలకు ప్రేరేపకాలు!




# మెఫ్రీన్ ఎస్టర్‌కాట్ టెరొసెల్

చారలలో, గళ్లలో 'ఎస్టర్‌కాట్'
పాలియెస్టరు కలిపిన కాటన్
సూటింగులు; ఆధునికమైన,
అద్భుతమైన రంగులలో మరియు
ప్రింట్లలో 'టెరొసెల్' పాలియెస్టరు
కలిపిన కాటన్ షర్టింగులు.

## మఫత్‌లాల్ గ్రూప్

AIYARS-M.874 TE

# ప్రశ్నోత్తరం

**...కె. రామలక్ష్మి...**

**ఎ. ఎన్. వి, జగిత్యాల**

ఈ రోజుల్లో చదువుకున్న యువతులు పాతికేళ్ళు వచ్చినా వివాహం చేసుకోక పోడానికి కారణం?

తమకు తగిన అబ్బాయిలు లభించక! తగిన అబ్బాయిలు— గొంతెమ్మ కోర్కెలు తీర్చలేక!! అబ్బాయిలు యీనాడు ఎదురు చూస్తున్న ఉద్యోగినులు కాకపోవడంచేత! .. ఇలా కరుడి చాపకి కారణాలు వెతకాలా సోదరా?

స్త్రీకి అబల అన్నపేరు ఎందుకు వచ్చిందో సెలవిస్తారా?

ఎవరినో ఒకరిని పెళ్ళాడితే తప్పించి 'దిక్కులేనిదిగా' భావించబడుతుంది కనుక ఆ పేరు వచ్చిందేమో— తెలియదు.

**జి. వి, మద్రాసు**

మీరు అబద్ధాలే ఆడతారు కాబోలు— అందుకే అంతా ఆడపిల్లలే — మీకు. అవునా?

ఒట్టు! నేనెప్పుడూ 'నిజమాడి' ఎరుగను. కావలిస్తే నా స్నేహితురాలూ, నా మాట ఎలా చెప్పినా నమ్మనిదీ— యిందిరా ఆనందబాబుని అడిగి చూడండి!

**వి. ఎస్. ఆర్, నరసన్నపేట**

సత్సాంప్రదాయాలను, ఆచారాలను వ్యతిరేకించడమే నాగరికతా?

కాదు. అవి మన పురోభివృద్ధికి ప్రతిబంధకాలయినప్పుడు— తెగించి, వాటిని తోసి రాజనగలడమే— నాగరికత.

**జి. ఆర్. ఆర్, కర్నూలు**

ఆలి—ఓలి మీద మీ ప్రశ్నావళి శీర్షికలో లెక్చర్లు దంచుతున్నారు. మీ అబ్బాయిని నా అల్లుడిగా చేసుకుందామనుకుంటున్నాను. ఎంత ఓలి యిస్తారు?

అయ్యోరామా! వోలి తక్కువ అని నా కొడుకు గొడ్డుదాన్ని పెళ్ళాడ్డండీ. . వాడికిష్టమైన అమ్మాయిని వాడే తెచ్చుకుంటానన్నాడు.

**యు. వి. సహాచ్. ఎమ్, తొగరాం**

ధనవంతుల నగరం జగిత్ అనే ఆర్క్టిక్ కొండల్లో అడవుల్లో నివసించే అనాగరికులకి వర్తించదుగా?

వారిది— బార్టర్ సిస్టమ్. వరుకే వారి ధనం, అంటే— అక్కడి ఆర్క్టిక్ 'నస్తుమార్పిడి యుదధ జగత్' అని వుండాలేమో,

**కొనుస్త్రలావు, సునీత, వరకాల**

అబద్ధం అంటే ఎరుగనిది?

ఆడది!

చావడానికి సులువైన మార్గం?

బ్రతకడానికి ప్రయత్నించడం కాదా!

**జి. ఆర్. బిల్లుపాడు**

వనితకు రసంత తెలిసినా అంతా తెలుసునని తలుస్తుంది.

మరి మీరో? ! ఆ గోలేం తెలియకుండా అంతా తెలుసుకునేవారికంటే— వనిత నయం కదా!

**ఎస్. ఎస్, అల్లాబాదు**

మీరెలా విజ్ఞానం ఆర్జించారో మాకా సూక్ష్మ మార్గాన్ని ప్రబోధిస్తారు కదూ?

విజ్ఞాన సముపార్జనకి దొడ్డిదారులు లేవు. (శ్రమించి చదువుకోవడమే అది చిన్నప్పటి నుంచి ....)

---

## హైదరాబాద్ ...

(8వ పేజీ తరువాయి)

దంతో 2,400 కొత్త లైనులు ఏర్పడి నగరపౌరులకు ఎంతో సౌకర్యం కలిగింది. ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు హైదరాబాద్ టెలిఫోన్సువారిని అభినందించారు. ఢిల్లీలోవల్లె, హైదరాబాద్‌లో టెలిఫోన్ సౌకర్యాలు పెరుగని, విస్తరణకు అన్నివిధాల సహకరిస్తామని హామీ యిచ్చారు.

**ఉపశ్రుతి**

'ముసలయ్యా, చూచావూ! నీ మనమడు పైసా ఖర్చులేకుండా ఇంజనీరు కావచ్చు. సాంకేతికవిద్య అంటే ప్రతి వృత్తి విద్య—ఉచితం. ఎంత మంచిపని చేసిందో సర్కారు చూడలె?' అన్నాను. ఒక తాతతో ఇటీవలి ప్రభుత్వ నిర్ణయం వివరిస్తూ.

'నా! మంచిగా చెప్పినవు దొరా. ఇంత దాన్కా ప్యాసయినోళ్లమాట సెప్పకపోతివి? వాళ్లకు కొలువు గిట్ల ఇప్పిస్తిరా?' అని ఎదురుప్రశ్న వేశాడు తత.

# జీసస్ క్రీస్తు కాశ్మీరులో ఖననం చేయబడెనా?

ఆంగ్లమూలం: జె. యన్. సాధు.

అనువాదం: ఆకుండి నారాయణ మూర్తి

(గత సంచిక తరువాయి)

జీసస్ ఆ గ్రామంలో నివాస మేర్పరచుకున్న తరువాతే ఆ గ్రామానికి 'పహల్ గామ్' అనే పేరు పెట్టబడినట్లుగా అందులో పేర్కొనబడింది. కాశ్మీర్ భాషలో 'పహల్' అంటే గొర్రెలకాపరి అని—'గామ్' అంటే గ్రామమని అర్థం! ... ఆ తరువాత శ్రీనగర్‌నకు వెళ్ళేదారిలో జీసస్ 'ఐశ్‌ముకామ్' అనే స్థలంలో కొన్నాళ్ళపాటు మతబోధన చేసినట్లు, విశ్రాంతి తీసుకున్నట్లు అందులో వున్నది. క్రీస్తు మకాము చేసిన స్థలమది అవడంవల్లనే దానికి 'ఐశుముకాము' అనే పేరు పెట్టబడుతుంది!... ఆ తరువాత జీసస్ తన శిష్యులతోను, అభిమానులతోను శ్రీనగర్‌నకువచ్చి షాలిమార్ గార్డెన్సునకు సమీపంలోగల 'ఇష్ బర్'లో నివాసమేర్పరచుకున్నాడు. 'రాజతరంగిణి' ప్రకారం ఆ స్థలానికి కూడా జీసస్ అక్కడ నివసించిన తరువాతే ఆ పేరు పెట్టబడినట్లు—అతనక్కడ ఒక నీటిబుగ్గ సమీపంలో నివసించినట్లు — యీనాటికీ దానినొక పవిత్రమైన నీటిబుగ్గగా ఆ ప్రాంతంలోని కొంతమంది జనులు భావిస్తున్నట్లు అందులో రికార్డు చేయబడింది.

శ్రీనగర్‌లో జీసస్ నివసించివున్నకాలంలో అతను 'యూస్‌యేసఫ్' లేదా 'జీసస్ ది గేదరర్'గా పరిచయం చేయబడినాడు ఆ గ్రంథంలో.

జీసస్‌క్రీస్తు తన నూటరెండవయేట సహజసిద్ధమైన మరణాన్నిపొంది శ్రీనగర్‌లో 'రోజా బాల్ ఖాన్‌యర్' అను చోట యూదుల ఆచారం ప్రకారం ఖననం చేయబడినాడని అహమ్మదీయుల నమ్మకం. అప్పటికి పందొమ్మిదివందల సంవత్సరాల క్రితం విదేశాలనుండి తన దేశానికి జీసస్ అనే ఒక ప్రభువు లేదా మతప్రవక్త వచ్చినట్లు—యూస్ యేసఫ్ అనే సమాధి అతనికి చెందినదేనని కాశ్మీరు దేశస్థులుకూడా నమ్ముతున్నారు.

సి. యమ్. యన్‌రిక్వెజ్ అనే రచయిత తను వ్రాసిన 'దేముళ్ళ దేశం' అనే గ్రంథంలో ఈ క్రిందివిధంగా వ్రాసేడు. 'జీసస్ తన యౌవనదశలోను, శిలువపైనుండి అసాధారణంగా బ్రతికి బయటపడి తప్పించుకున్న తరువాత భారతదేశంలో సంచరించినట్లుగా గమనించదగ్గ యితిహాస గాథలున్నాయి!... నేను కాశ్మీరులో నివసించియున్న రోజులలో అప్పటి సమాధులకు సంబంధించిన ఎన్నో కుతూహలజనకమైన గాథల్ని విన్నాను. క్రీస్తు సమాధిగా చెప్పబడుతున్న సమాధి ఒకటి అక్కడ వున్నది. శ్రీనగర్ అంతా అతి ప్రాచీనమైన సమాధుల శిథిలాలతో నిండివున్నది.

'జీసస్ సమాధిగా భావింపబడుతున్న ఆ సమాధిని, అచ్చటగల ముస్లిమ్ సమాధులతో పోల్చి చూస్తే చాలా విభిన్నంగాను, విలక్షణంగాను కనిపిస్తుంది. ఆ సమాధి పాదములు మక్కాకు అభిముఖంగా ఉన్నవి. ఇకపోతే ఆ సమాధి అచ్చటగల ముస్లిమ్ సమాధులకంటే పెద్దది. ఒకే గది కలిగియుండి యూదుల పద్ధతిలో కిటికీలు, ద్వారబంధం కలిగి ఉన్నది. ఆ సమాధిరాతిపై హిబ్రూ భాషలో ఏదో లిఖించబడి వున్నది. వాతావరణ ప్రభావంచే దానిపై వ్రాయబడిన అంశాల స్పష్టంగా చదివి అర్థంచేసుకోడానికి వీలులేని స్థితిలో వుందది!—కాశ్మీర్‌లో మొగలాయీల పరిపాలనాకాలంలో ఆ సమాధి సంరక్షకుడిగా ఒక స్థానిక ముస్లిమ్‌ను నియమించడం జరిగింది. అతనికిచ్చిన అధికారపత్రంలో యూస్ యేసఫ్ ప్రవక్తయొక్క సమాధిగా దానిని పేర్కొన్నారు. ఇకపోతే ప్రాచీన కాశ్మీర దేశ చరిత్రకూడా, అచ్చటకు శాంతికాముకుడైన ఒక విదేశీయ మతప్రవక్త తన జాతీయులను అన్వేషిస్తూ వచ్చినట్లుగా ఎన్నో విధాలలో తెలియజేస్తోంది.'

'ది సర్పెంటాస్ పేరడైజ్' అనే గ్రంథంలో ఏ. గ్రాంది రచయిత యీ క్రింది విధంగా వ్రాసేడు. 'జీసస్ క్రీస్తు తన ముప్పదిసంవత్సరముల వయస్సు వచ్చి మతప్రచారం ప్రారంభించేటంతవరకూ అతనెక్కడ వుండేవాడో ఏంచేసేవాడో ఎవ్వరికీ తెలియదు. ఏది ఏమైనా ఒకానొక గాథ ప్రకారం అతను యీనాడు కాశ్మీర్‌గా పిలువబడుతున్న 'కాష్మీర్'లో ఉన్నట్లు తెలుస్తోంది. 'కా' అంటే సమానమైన అనియు, 'షిర్' అంటే సిరియా అనియు అర్థం. 'కాష్మీర్' అంటే సిరియాతో



డిసెంబరు 16వ హైదరాబాదులోని ముషీరాబాద్ టెలిఫోన్ ఎక్స్చేంజికి ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ప్రారంభోత్సవం చేశారు. ప్రారంభోత్సవానికి ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షత వహించారు.

## మనవి

ఉత్తరాలు రాసేవారు తమ పేరు, పూర్తి చిరునామాతోసహా, తెలుగు లిపి మాత్రమే వాడాలి.

—సం॥



# జీసస్...

సమానమైనదని అర్థం!... సంస్కృతభాష లోంచి ఉత్పత్తి చెందిన శారదా భాషలో గల ప్రాత ప్రతులలోని విషయాలు 'బైబిలు గాథకు సంబంధించినవిగా ఉన్నాయి. జీసస్ కాశ్మీర్ వచ్చి, అచ్చట మహామహిమాన్వితులైన మునీశ్వరుల శుశ్రూష చేసి, కొన్ని అత్యద్భుత అతీంద్రియ శక్తులను పొందినట్లుగా కాశ్మీర్‌గాథ చెప్తోంది.

'ఆ తరువాత జీసస్ మధ్య ప్రాచ్యానికి తిరిగివెళ్ళి అచ్చట గల అమాయకులగు యిస్రాయిలు ప్రజలకు తను కాశ్మీర్‌లో నేర్చుకున్న మహత్తర సత్యాలను బోధించేడు. అప్పటి ప్రజలను తనవేపు ఆకర్షించి, వారికి తన బోధనలపై నమ్మకం కలిగేటట్లు చేసేటందుకై అతను తరచుగా తను యోగాభ్యాసంవల్ల సాధించిన శక్తులను ప్రదర్శించేవాడు. ఇలా ప్రదర్శించిన శక్తులే అమానుషమైన అత్యద్భుత కృత్యములుగా వర్ణించబడినాయి!... మరి కొంతకాలం పోయేక జీసస్ క్రీస్తు సిలువ వేయబడినాడు. కాని అతను సిలువపై చనిపోలేదు. ఎస్సెన్ సోదరులు జీసస్‌ని కాస్త స్వస్థత చేకూరేటంతవరకూ రహస్యంగా కాపాడి, ఆ తరువాత అతనిని భద్రంగా కాశ్మీర్ పంపేరు. అతనక్కడ సహజసిద్ధమైన మరణం వచ్చేటంతవరకూ నివసించేడు.

'అయితే యీ గాథకు సంబంధించిన మూలగాథ యిస్లాముకు సంబంధించినదిగా చెప్పడానికి కొంత సాక్ష్యమున్నప్పటికి బహుశా యిది యింకా ప్రాచీనమైనదేమో ననిపిస్తోంది!... ప్రాచీనకాలంలో మధ్యప్రాచ్యానికి, భారతదేశానికి రాకపోకలు చాలా అధికంగా ఉంటూండేవి. అంచేత భారతదేశ పురాణేతిహాసాలకు సంబంధించిన గాథలు మధ్యప్రాచ్యానికి చేరుకొని ఉంటాయి. శాంతి, సమానత్వం అనే పవిత్ర భావాలు — క్రీస్తుకు పూర్వమే బుద్ధునిచే ప్రచారం చేయబడ్డాయి. అశోక చక్రవర్తి ఆ భావాలను — క్రీస్తు ఇంకా అట్టి భావాలను చెప్తవారికి బోధించక మునుపే కాశ్మీరుదేశంలో ప్రచారం చేయించేడు. కాశ్మీరుదేశంలో జీసస్ క్రీస్తు బౌద్ధ మత సిద్ధాంతాలచే కొంతవరకూ ప్రభావితుడయినాడని అతను ప్రచారం చేసిన భావాలు వ్యక్తపరుస్తున్నాయి!

'శ్రీనగర్‌లో జీసస్‌యొక్క సమాధిగా చెప్పబడుతున్న దానిపై ఎన్నో పరిశోధనలు జరిగేయి. అయితే అది ఒక ప్రాచీన యిస్లాం మతగురువుదైనా, సూఫీ మాష్టరుదైనా కావచ్చునడానికి అవకాశం లేకపోలేదు. ఎంచేతంటే 'ఈ ఊహ'ల్ని ఋజువు చెయ్యడానికి నిశ్చితమైన సాక్ష్యాధారాలేవి నిజానికి లేవు!

'నేను ఆ సమాధి దగ్గరకెళ్ళేసరికి సాయంత్రమయింది. ఆ సాయంకాలపు సూర్యకాంతిలో ఆ వీధిలో సంచరిస్తున్న పురుషుల, పిల్లల ముఖాలు ఎంతో పవిత్రంగా కనిపించేయి. చాలా ప్రాచీనకాలపు ప్రజలులాగ వారు నాకగుపించేరు. వారు యిండియాకు వలసపోయిన ఇస్రాయిలు జాతీయులయొక్క ఒక తెగకు సంబంధించిన వారయుంటారని ఊహించడాని కవకాశం లేకపోలేదు. నా పాదరక్షలను విడిచివేసి లోనికి ప్రవేశించేను. నగిషీలు చెక్కిన ఒకరాతి ఆవరణమధ్య ఒక సమాధి ఉన్నది. అక్కడ ఒకవేపు ఒకరాతిపై ఒక పాదముద్ర చెక్కబడి వున్నది. అది యూసాయేసఫ్‌దని అక్కడివాళ్ళు చెప్పేరు. యూసాయేసఫ్ అంటే జీసస్ క్రీస్తేనని అచ్చటి యితిహాస గాథవల్ల వ్యక్తమౌతుంది. అచ్చటి భవనపుగోడపై ఒక శాసనము వుంది. దాని క్రింద శారదానుండి యింగ్లీషులోనికి అనువదించబడింది. అది యూసా యేసఫ్‌దని తెలియజేస్తోంది.' (ఖాన్ యార్, శ్రీనగర్)'

జీసస్ క్రీస్తు కాశ్మీరులోగల ఆ సమాధి నుండికూడా బహుశా పునరుద్ధానము చెంది వుండవచ్చును. ఆ సమాధిని మనం తెరచి చూసినట్లయితే అది ఖాళీగానే మనకు కనిపించవచ్చును. బహుశా మరో లోకంలోకూడా జీసస్ క్రీస్తు యీసారికి సిలువ వేయబడి వుండవచ్చును!... మరి ఆ ప్రభువు ప్రబోధించిన పవిత్రసిద్ధాంతాలను ఆచరణలో పెట్టే వాళ్ళ సంఖ్య అంతకంతకు ఈ భూమిపై తగ్గిపోతోందిగా!

[ఈ అనువాద వ్యాసంలో అక్కడక్కడ విషయాన్ని మరింత విపులీకరించడంకోసం బైబిలునుండి కొన్ని అంశాలను అదనంగా ఉదహరించేను. నిజానికి ఈ వ్యాసంలోని భావాలేవీ నా స్వంతం కావు. గమనించ ప్రార్థన— ఆకుండి నారాయణమూర్తి.]



—(అయిపోయింది)

# 1973 లో మీ రాశి ఫలం

మహేష్

## కుంభం

ప్రతి సంవత్సరం జనవరి 21 వ తేదీ నుంచి ఫిబ్రవరి 19 వ తేదీ వరకు సాయనసూర్యుడు కుంభరాశి యందు ఉంటాడు. కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించినవారు కుంభరాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు. జనన సమయంతో కాని నక్షత్రంతో కాని దీనికి నిమిత్తం లేదు

2, 7, 11, 16, 20, 25, 29 తేదీల్లో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులు మొదటి నుంచీ శ్రద్ధగా చదవడం అవసరం.

**జనవరి**—కొన్ని వ్యవహారాలు సులువుగా నెరవేరినా మరికొన్నింటిలో శ్రమ కలుగుతుంది. వృత్తి వ్యాపారాలలో శ్రమ మీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. రావలసిన డబ్బు సమయానికి అందక పోవడం వలన మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఉద్యోగంలో చికాకుల యేర్పడతాయి. కోర్టు వ్యవహారాలలో శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. నెలాఖరులో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది

**ఫిబ్రవరి**—వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆర్థిక వ్యవహారాల్లో యితరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. ప్రయాణాల్లో మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు. కొంతమంది వ్యక్తులు మంచి మాటలతోనే మిమ్మల్ని పెడదారులు పట్టించడానికి ప్రయత్నిస్తారు

**మార్చి**—ఇదివరకు మీరు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకున్నట్లుగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. భారీ యెత్తున చేసే వ్యాపారాలు లాభిస్తాయి. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కలుసుకొంటారు మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి

**ఏప్రిల్**—వృత్తి వ్యాపారాల్లో శ్రమ మీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. ఏ వ్యవహారంలోనైనా చేజిక్కిన ఫలితంతో సంతృప్తి పొందడం మంచిది. మీ ఆలోచనలు యితరులకు లాభదాయకంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి.

**మే**—వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగానే ఉంటాయికాని ఫలితం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి. బంధు మిత్రులను కలుసుకొంటారు. కొన్ని వ్యవహారాల్లో తొందర పడడంవలన మీరు పొందవలసిన లాభాన్ని పొందలేకపోవచ్చును.

**జూన్**—మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. ముఖ్యమైన వ్యవహారాల్లో సమయానికి మిత్రుల సహకారం లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు బాగుంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**జూలై**—వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. కొంతమంది మిత్రులతోనే అకారణంగా భేదాభిప్రాయాలు రావచ్చును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**ఆగస్టు**—మీ కార్యక్రమాల్లో ఆందోళనకు గురికాగలరు. వృత్తి వ్యాపారాల్లో ప్రయాసమీద ప్రయోజనం మరొకరికి కావచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం తగదు. ఉద్యోగంలో అధికారులతో చికాకులు రావచ్చును. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. రాజకీయ వ్యవహారాల్లో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి.

**సెప్టెంబరు**—భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో చికాకులు యేర్పడతాయి. వృత్తి వ్యాపారాల్లో ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది. కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులను కూడా పూర్తిగా నమ్మడం తగదు. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి స్వల్పాటంకాలు వస్తాయి. డబ్బు యిచ్చి పుచ్చుకోవడాల్లో జాగ్రత్త అవసరం. నెలాఖరులో క్రమంగా అనుకూల పరిస్థితి యేర్పడుతుంది.

**అక్టోబరు**—ఈనెల మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. వ్యాపారంలో ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ఉద్యోగంలో అనుకూల వార్తలను వింటారు. కుటుంబ సంతోషం లభిస్తుంది. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి.

**నవంబరు**—ఈనెల శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. కొన్ని వ్యవహారాల్లో మీరు వెనకకు తగ్గడమే మంచిది కాగలదు. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. ఏ వ్యవహారంలోను యితరులమీద ఆధారపడడం తగదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు. శుభ కార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి.

**డిసెంబరు**—వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఇదివరకు ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తి చేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. ఆరోగ్యం బాగుంటుంది.

## మీనం

ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 20 వ తేదీ నుంచి మార్చి 21 వ తేదీ వరకు సాయనసూర్యుడు మీనరాశి యందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించినవారు మీనరాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు. జనన సమయంతో కాని నక్షత్రంతో కాని దీనికి నిమిత్తం లేదు.

2, 7, 11, 16, 20, 25, 29 తేదీల్లో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులు మంచిమార్కులతో కృతార్థులు కావచ్చును.

**జనవరి**— వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల మున్ముందు కూడా మీకు ఉపయోగం ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రు

# రాశిఫలం

ను కల్సుకొంటారు. అనవసరమైన వ్యవహారాల్లో జోక్యం చేసుకొని కాలాన్ని వ్యర్థం చేసుకొనే ప్రమాదం ఉంది.

**ఫ్రిబవరి**— కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వృత్తి వ్యాపారాల్లో ఆదాయవ్యయాలు రెండూ పెరుగుతాయి. ఉద్యోగంలో మార్పుల నిమిత్తం ప్రయత్నించడానికి యిది సమయంకాదు. అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి, వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో వ్యతిరేకత యేర్పడుతుంది. కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడి సర్దుకొంటాయి.

**మార్చి**— గడచిన నెల కంటే యీనెల బాగానే ఉంటుంది కాని కార్యసాధన కోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా ప్రవర్తించవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన వ్యవహారాల్లో ప్రయాస అధికంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ఏప్రిల్** — భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. కుటుంబవ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు. ఆరోగ్యం బాగుటుంది

**మే**—మీరు వాకచక్యంగా వ్యవహరించడం వలన వృత్తి వ్యాపారాల్లో తగినంత అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు మొత్తం మీద లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు, బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. పజ్జన సాంగత్యం లభిస్తుంది. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు.

**జూన్**—వృత్తి వ్యాపారాల్లో మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మోసగాళ్ళకు లొంగిపోవడం వలన ముమ్ముందు యిబ్బంది కలుగుతుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. విలాస వస్తువులు కొంటారు ఇతరుల మూలంగా మీరు శ్రమ పొందవలసి వస్తుంది.

**జూలై** — అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వృత్తిలో చేజిక్కిన ఫలితంతో సంతృప్తి పొందడం మంచిది కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**ఆగస్టు** — వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి, వస్తుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. సాంఘిక కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. దైవకార్యాలు నెరవేరతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**సెప్టెంబరు**— భవిష్యత్తులో మీకు బాధ్యతను కలిగించే వాగ్దానాలు చేయడం తగదు. వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు శ్రమ మీద నెరవేరతాయి. అనవసరంగా మీరు కొన్ని అపోహలకు గురి కాగలరు. ఆరోగ్యంసామాన్యంగా ఉంటుంది. పోటీవారిలో గౌరవంలభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**అక్టోబరు**— సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మార్పులు చేయడానికి యిది సమయంకాదు. కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయి కాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. ఉద్యోగంలో యితరుల మూలంగా మీరు శ్రమ పొందవలసి వస్తుంది. కుటుంబ వ్యవహారాలలో బంధువుల మూలంగా చికాకులు యేర్పడతాయి.

**నవంబరు**—ఈనెల మీ కార్యక్రమాలో క్రమంగా అనుకూలత లభిస్తుంది. వృత్తి వ్యాపారాలు యిదివరకటి కంటే బాగుంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రులకు సహాయం చేయగలరు. మీ ఆరోగ్యం బాగుంటుంది కాని కుటుంబంలో వారికి అనారోగ్యం చేయవచ్చును. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**డిశంబరు**—ముమ్ముందు మీకు ఉపయోగించగల వ్యవహారాల్లో చొరవ చూపించవలసిన సమయం. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి, స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

(అయిపోయింది) ●

## మంగ్గురుష్ఠార్థులు

(58వ పేజీ తరువాయి)

అమల్లో ఉండాలని తెలంగాణా ప్రజలు అప్పుడు ఆందోళనచేస్తే మళ్ళా పొడిగించడం సంభవమేనని యెవరైనా సులభంగానే ఊహించవచ్చును. అప్పుడైనా ఆంధ్రప్రజలు ప్రత్యేక రాష్ట్రంకోసం ఆందోళన చేయవలసి ఉంటుంది. అందుచేత యింకా కొంత కాలంపాటు ఆంధ్రప్రాంతం వారు యిబ్బందులు పడినతరువాత ప్రత్యేక రాష్ట్రం కోసం కృషిచేయడం కంటే, యిప్పుడే ప్రత్యేక రాష్ట్రంకోసం ఆందోళన చేయడం మంచిదికాదా? ఆంధ్రప్రాంతంతో కలిసి ఉండడంవలన తెలంగాణా ప్రాంతం అభివృద్ధి చెందడం లేదు కదా! తెలంగాణా నాయకులు అంటున్నారు. అందుచేత రెండు ప్రాంతాలూ వేర్వేరుగా కొంతకాలంపాటు ఉన్నట్లయితే తెలంగాణా ప్రాంతంకూడా బాగా అభివృద్ధి అవుతుంది. ఆ తరువాత రెండు ప్రాంతాలూ బేషరతుగా తిరిగి కల్సిపోవచ్చును. ఇందులో తప్పేమీ లేదు' అన్నాడు చూడామణి.

'హైదాబాదులో ముల్కీ నిబంధనలు అయిదు సంవత్సరాలు ఉంటాయి' అని ప్రధానమంత్రిణి చెప్పడంలో యింకో అంతరార్థం కూడా ఉండవచ్చును' అన్నాడు చిదంబరం

'ఏమిటా అంతరార్థం?'

'ఈ అయిదుసంవత్సరాల లోపున మళ్ళా లోకసభ యెన్నికలు, అసెంబ్లీ యెన్నికలు జరిగిపోతాయి. ఆ తరువాతి మాట తరువాత చూసుకోవచ్చును. ఈ ముల్కీ సమస్య ప్రభావం యెన్నికలమీద పడదు' అని ప్రధానమంత్రిణి ఆలోచించి ఉండవచ్చును' అన్నాడు చిదంబరం.

'అవును. అమధ్య అష్టగ్రహకూటమి వచ్చింది. అప్పుడు ప్రపంచమంతా మునిగిపోతుందని కొందరు భయపడ్డారు. అష్టగ్రహకూటమికి ముందుడబ్బు అప్పు పుచ్చుకొనేవారు తాము అష్టగ్రహకూటమి అయిపోయిన అప్పతీరుస్తామని చెప్పేవారు. అష్టగ్రహకూటమికి ప్రపంచం నిజంగా మునిగిపోతే తాము తిరిగి అప్పతీర్చవలసిన అవసరమే ఉండదు' అని వారి అభిప్రాయం. అలాగే మళ్ళా యెన్నికలుకూడా జరిగిపోతే తరువాత సంగతి అప్పుడు ఆలోచించవచ్చును' అని ప్రధానమంత్రిణి, అభిప్రాయం కావచ్చును' అన్నాడు చూడామణి.

'ఇక మనం యిళ్ళకు బయల్దేరవచ్చును' అని చంద్రరావు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు, ●

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press: 6 & 7, Thambi Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.**
**Editor : S. Radhakrishna.**



అందాలే కాకుండా ఆకర్షణని కూడా పొందుపరచుకున్న సుందరి జూడీజోన్స్

